

చాముండేశ్వరాలయం—మైసూర్

ఫోటో : గోపాల్—మద్రాసు.

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతి 4 అ.



# సచిత్రవారపత్రిక

Founder : K. NAGESWARA RAO

సంపుటము 48
సంచిక 42
22.6-55

మన్మథ ఆషాఢ శుద్ధ తృతీయ బుధవారం

"గంగా స్నానం"

ఫొటో: సాళ్వం రామకృష్ణశాస్త్రి, రాజమండ్రి.




# సుందరం ఇండస్ట్రీస్

(టి. వి. ఎస్. కు చెందినది)

## రెండవ
## టయర్ రీ ట్రెడింగ్ ఫ్యాక్టరీ,

**37, వరాంజ్ రోడ్డు, మద్రాసు-6.**

**సామానులను భద్రపరచుటకు ఏర్ - కండిషన్ స్టోరేజీలు - కారు, బస్సు, లారీ టయర్లకు వివిధ గుండ్రని లోడీ మౌల్డులు - హామీ గల సాధనం.**

మద్రాసులోగల మా రెండవ ఫ్యాక్టరీ, మద్రాసునగరానికి మద్రాసు రాష్ట్రంయొక్క ఉత్తర జిల్లాలకు, ఆంధ్ర రాష్ట్రానికి టయర్లను అతి శీఘ్రంగా రీ ట్రెడ్ చేసి, చేర్చుకలందులకు తోపహ యుత్తున్నది.

**సుందరం ఇండస్ట్రీస్ లిమిటెడ్,**
**మదురై.**



# ఐక్యరాజ్యసమితి

ఐక్యరాజ్యసమితి దశమ వార్షికోత్సవాన్ని ఈనెల 20వ తేదీని జరుపుకొంటున్నది. అణుయుగంలో పూర్తిగా ఒక దశాబ్దంపాటు ఆ సంస్థ సజీవంగావుంది. అటువంటి ఆ సంస్థ ఈనాడు శైశవావస్థలో ఏమీ లేదు ప్రచ్ఛన్నయుద్ధాన్ని, రాజకీయమైన ఒడుదొడుకులను, వలసదేశాల విముక్తిని, గొప్ప సాంఘిక శాస్త్ర విజ్ఞాన పరివర్తనాన్ని ఆ సంస్థ ఈ పదిసంవత్సరాల లోను కళ్ళజూచింది.

శాన్ ఫ్రాన్సిస్కోలో 1945 జూన్ 26వ తేదీన సంతకాలుచేయబడిన ఐక్యరాజ్యసమితి చార్టరుయొక్క అవతారికలో — "యుద్ధభీభత్సాన్నుంచి ముందుతరాలవారిని రక్షించడం, ఇంకావిస్తృతిస్వాతంత్ర్యంలో సాంఘికాభ్యుదయాన్ని ఉత్తమజీవన ప్రమాణాలను పెంపొందించడం" సమితిలక్ష్యాలని ప్రకటించబడింది.

ప్రపంచశాంతిని సుస్థిరం చేయడంకోసం, మరోయుద్ధభయం లేకుండా మానవాళిని కాపాడడంకోసం, అవలంబించవలసిన సాధనవిధానాలను నిర్ణయించే నిమిత్తం, రెండవ ప్రపంచమహాయుద్ధంలో విజేతలైన ప్రజాస్వామికరాజ్యాలు పది సంవత్సరాల క్రితం ఏప్రిల్ 25వ తేదిని శాన్ ఫ్రాన్సిస్కోలో సమావేశమై ఈ సంస్థకు రూపకల్పన చేశారు.

వాస్తవానికి ఈ సంస్థకు పునాది అట్లాంటిక్ చార్టర్. 1941 లో ఇద్దరు అగ్రరాజ్య నాయకులు అట్లాంటిక్ మహాసముద్ర మధ్యంలో ఒక యుద్ధనౌకపై సమావేశమైనారు. వారు అప్పటి అమెరికా అధ్యక్షుడు రూజ్వెల్టు బ్రిటిష్ ప్రధానమంత్రి చర్చిల్. అట్లాంటిక్ ప్రణాళికలనే పేరుతో ప్రపంచ ప్రఖ్యాతమైన ఒక సంయుక్త ప్రకటనను వీరు 1941 ఆగస్టు 14వ తేదీన జారీచేశారు.

ఈ ప్రణాళికలోని 8వ సూత్రంలో యిలా వుంది. ఐహిక కారణాలదృష్ట్యానే కాక, ఆధ్యాత్మిక హేతువులదృష్ట్యాకూడా నిఖిల ప్రపంచదేశాలూ, హింసా ప్ర[illegible]గాన్ని శాశ్వతంగా సన్యసించాలని మా దృఢవిశ్వాసం. ప్రపంచ శాంతి భద్రతల రక్షణకు శాశ్వతమైన విస్తృతవ్యవస్థనొక దానిని స్థాపించే యీలోగా, వివిధదేశాలూ ఆయుధవిసర్జనచేయడం అత్యవశ్యకమని మా అభిప్రాయం."

అటుపిమ్మట మూడు మాసాలకు, 'మిత్రరాజ్య ప్రకటన' అనే మరో ప్రకటన వెలువడింది. 1942వ సంవత్సరాదినాడు అధ్యక్షుడు రూజ్వెల్టు, ప్రధాన మంత్రి చర్చిల్, మేక్సిమ్ లిట్వినావ్, డి. వి. సూంగ్‌లు దీనిపైన సంతకాలు చేశారు. ఆ మరునాడు, మరి 22 దేశాల ప్రతినిధులు కూడా యీ ప్రకటనపై చేవ్రాళ్లు చేశారు. యుద్ధాన్ని జయప్రదంగా సమాప్తం చేయడానికి శాయశక్తులా కృషిచేస్తామనీ, శాంతి ఒడంబడికలు వేర్వేరుగా వ్రాసుకోమనీ, వారా ప్రకటనలో పరస్పరం హామీలిచ్చుకొన్నారు. అట్లాంటిక్ ఒడంబడికలోని సూత్రాలను పురస్కరించుకునే, వారీమైత్రి కుదుర్చుకొన్నారు.

1943 సంవత్సరాంతంలో రూజ్వెల్టు, స్టాలిన్, చర్చిల్, టెహరాన్‌లో ప్రథమ పర్యాయంగా సమావేశమై ప్రపంచసంస్థకు దిఙ్మాత్రంగా ఒక పథకాన్ని తయారు చేశారు. ఈపథకం ఆధారంగా ఐక్యరాజ్యసమితి రూపొందింది.

మిత్రరాజ్యసమితి నాలుగు ప్రధానాంగాలతో కూడినదై వుండాలనీ, యీ ప్రతిపాదనలలో నిర్దేశించబడింది. మిత్రరాజ్యసమితిలోని అన్ని రాజ్యాల ప్రతినిధులూ సభ్యులుగా జనరల్ అసెంబ్లీ అనే ఒకసభను ఏర్పాటుచేయాలి. భద్రతామండలి అనేది మరొకటి నెలకొల్పాలి. ఇందులో ఐదుగురు శాశ్వతసభ్యులూ ఆరుగురు తాత్కాలిక సభ్యులూ మొత్తం పదకొండుమంది వుంటారు. తాత్కాలిక సభ్యులు జనరల్ ఎసెంబ్లీలోని సభ్యదేశాలనుంచి ఎంచుకోబడతారు. వీరు రెండేళ్లపాటు సభ్యత్వం వహిస్తారు. ఇక, ఆర్థిక, సాంఘికమండలి అనే మరొక సంఘం వుంటుంది. ఈ మూడూ కాక అంతర్జాతీయ న్యాయస్థానం అనే నాల్గవసంస్థనుకూడా నెలకొల్పాలని సూచించబడింది. మిత్రరాజ్యసమితి ఒక కార్యాలయం ఏర్పాటుచేయాలనిన్నీ సూచించడమైనది.

భవిష్యత్తులో యుద్ధాలను నివారించే బాధ్యతను భద్రతామండలి వహించాలని, వివిధసమస్యలనూ చర్చించి, అంతర్జాతీయ శాంతి సహకారాలను ప్రోదిచేయడానికి జనరల్ అసెంబ్లీ తగు సూచనలను చేస్తూ వుండాలని, యుద్ధనివారణకూ, దురాక్రమణను ప్రతిఘటించడానికీ, సభ్యరాజ్యాలు అవసరమైనప్పుడు తమ సాయుధసైన్యాలను భద్రతామండలి అధీనంలో వుంచాలనీ నిర్ణయమయింది. ఈవిధంగా సాయుధ సైన్యాలు అండదండగా లేకపోవడంవల్లనే, పూర్వపు నానాజాతిసమితి విఫలమైపోయిందనీ, ఇప్పుడా లోపాన్ని పూరించాలనీ, యీ పథకం రచయితలు అభిప్రాయపడ్డారు.

1945 ఏప్రిల్ 25వ తేదీన శాన్ ఫ్రాన్సిస్కో సమావేశంలో ప్రపంచ జనాభాలో నూటికి 80 వంతుల జనాభా ప్రతినిధులు అనగా మొత్తం 50 దేశాల ప్రతినిధులు పాల్గొన్నారు. ప్రపంచంలో యింతటి బ్రహ్మాండమైన అంతర్జాతీయ సమావేశం అతఃపూర్వ మెప్పుడూ జరిగి వుండలేదు.

1955 జూన్ 25వ తేదీన వివిధ దేశాల ప్రతినిధులూ, హాలీఫాక్సు ప్రభువు అధ్యక్షతన శాన్ ఫ్రాన్సిస్కో అపెరాహౌసులో సమావేశమై ప్రణాళిక తుది ముసాయిదాను ఆమోదించారు. ఫాసిస్టు రాజ్యాల దురాక్రమణకు మున్ముందుగా బలియైన చైనా ప్రణాళికమీద ప్రప్రథమంగా సంతకం చేశారు. ఆ తరువాత 1945 అక్టోబరు 24వ

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : ఆర్. కె. పిక్చర్స "జాగ్‌తే రహో" చిత్రంలో స్మృతి బిశ్వాస్.

భారత ప్రధాని పండిత నెహ్రూ ఈనెల 7 వ తేదీన రష్యా రాజధాని మాస్కో చేరుకొన్నారు. మాస్కో నగరవీధులలోనుంచి పండిత నెహ్రూ వెళుతూండగా వేలాది పౌరులు ఆయనను అభినందించారు.

## ★ ఐక్యరాజ్యసమితి ★

తేదీన యీ అంతర్జాతీయ సంస్థ ఆవిర్భ వించింది.

*  *  *

10 ఏళ్ళ క్రిందట ఏభై దేశాల ప్రతినిధులతో స్థాపించబడిన ఈ సంస్థ నేటి అన్ని దేశాల సభ్యత్వంతో మానవజాతి యొక్క ప్రగతికి బహుముఖాలుగా తోడ్పడుతున్నది.

ప్రపంచ దేశాలన్నిటికీ సమానమైన ఆయా ఆశయాలకూ, లక్ష్యాలకూ అనుగుణంగా వివిధజాతుల కార్యక్రమాలనూ మలచి సమన్వయ పరచడానికి మిత్రరాజ్య సమితి యీ పదేళ్ళలోనూ ఎంతో తోడ్పడింది. సమష్టి భద్రత, అంతర్జాతీయ వివాదాలను రాయబారాలద్వారా శాంతియుతంగా పరిష్కరించుకోవడం, ఆయుధ సామగ్రిని అంతర్జాతీయంగా కంట్రోలు చేయడం; మానవాళియొక్క ఆర్థిక, సామాజిక శ్రేయస్సుకు అంతర్జాతీయంగా సహకరించటం: ఈ లక్ష్యాలకోసం సంస్థ నిర్విరామంగా కృషిచేస్తున్నది.

మిత్రరాజ్య సమితి, శాసనసభ వంటిది కాకపోయినా, ఆయా దేశ ప్రభుత్వాల పరస్పర సహకారంతో, కొన్ని లక్ష్యాలను సాధించదగ్గ ఒక పటిష్ఠ సాధనం. ఈ సహకారం అనేక విధాలుగా జరుగుతోంది. అరవై సభ్యులతో కూడిన జనరల్ అసెంబ్లీ పదకొండు మంది సభ్యులతో కూడిన భద్రతామండలి, 18 మందితో కూడిన ఆర్థిక సాంఘిక మండలి, 12 గురు సభ్యులతో కూడిన ధర్మకర్తృత్వ సంఘం, ఇంకా ఎన్నెన్నో కమిషన్లూ, కమిటీలూ, యీ సంస్థలో అంతర్భాగాలై ఉన్నాయి.

ప్రపంచంలో అధికారదాహం, సిద్ధాంత భేదాలూ, యీ సంస్థ అవతరించిన నాటికన్నా నేడు మరింత వ్యగ్రమై పైకి పొటమరించినప్పటికీ, యీ పదేళ్ళ కాలావధిలోనే, మిత్రరాజ్యసమితి ప్రశంసనీయమైన విజయ పరంపరను సాధించింది.

ఇండోనేషియా, నెదర్లాండ్సుల మధ్య వివాదాలు శాంతియుతంగా పరిష్కారమైనాయంటే అది యీ మిత్రరాజ్యసమితి పెట్టిన భిక్షే. మిత్రరాజ్యసమితి మధ్యవర్తిత్వం వల్లనే పాలస్తీనాలో యుద్ధ విరమణ జరిగింది. సమితి పర్యవేక్షకుల మాత్రధారిత్వం వల్లనే, బాల్కన్లలో, గ్రీసు ఉత్తర సరిహద్దున క్రమక్రమంగా శాంతి నెలకొన్నది.

బెర్లిన్‌పై రష్యావారి దిగ్బంధం, బ్రిటన్, అమెరికాలకు మరోకవంకా ఏర్పడిన ప్రతిష్టంభన మిత్రరాజ్యసమితి కార్యాలయ ఛాయలలో ఆయా దేశాల ప్రతినిధులకు కుదిరిన ఒప్పందం వల్లనే పరిష్కారమయింది.

ఇక, అస్త్ర సన్యాసం, అణ్వస్త్రాల కంట్రోళ్ళ విషయంలో లక్ష్య నిర్వచనం, లక్ష్య సామ్యం సాధించడమయిందిగాని, యింకా ఆ లక్ష్యాలను సాధించడానికి అనుసరించవలసిన మార్గాల విషయంలో మాత్రం ఏకీభావం కుదరలేదు. ఇది ఒక ఎడతెగని అన్వేషణ; మిత్రరాజ్యసమితి ఆధ్వర్యానే యీ అన్వేషణ చివరకు సఫలీకృతం కావాలి.

★

# "పాపయ్య పాడిబఱ్ఱెకొన్నాడు!"

భారతమ్మ నెయ్యి అరువుకోసం పొరుగింటికి పయనమైంది. పొరుగింటి పద్మనాభం సావిట్లో ఎవరితోనో ముచ్చటలాడుతూవున్న కారణాన ఆమె పక్కగొందిలోనుంచి దొడ్డిలోకి దారి తీసి చూచిందిగదా శారదమ్మ పాటిబఱ్ఱెదగ్గర కూర్చుని పాలు తీస్తూవుంది. అవలీలగా రెండు శేర్లపాలు పట్టే చెంబూ దాదాపు నిండవస్తూవుంది. తెల్లని పాలమీద నురగ పొంగి పురకలెత్తుతూవుండగా శ్రావ్యమైన శబ్దం చేసుకుంటూ రెండు పాలధారలూ పడుతున్నాయి. ముందు కట్టేసిన పెయ్యదూడ మూతి నాకుతూ బఱ్ఱె కదలకుండా రథంలా నిలబడి వుంది. శారదమ్మ ప్రశాంతంగా కూర్చుని అలౌకిక ఆనందంలో మునిగివున్నదో మరేమో గాని భారతమ్మ పిలిచిన "పిన్నీ" అనే తొలిపిలుపుకు ఆమె వులుకూ పలుకూ లేకుండా కూర్చుండిపోయింది.

"ఓ యమ్మో......పిన్నిగారేదో ఆలోచిస్తూ వున్నారే" అన్నది భారతమ్మ.

శారదమ్మ వెనక్కి తిరిగిచూసి వల్లమాలిన ఖంగారుపడింది. అంతలోనే లేచి నిలబడి "ఆహా భారతమ్మా......ఎవరో అనుకొని వులికిపడ్డాను" అన్నది.

అయితే శారదమ్మ ఖంగారుకు అసలు కారణం వేరే వుంది. శారదమ్మ వస్తుతః మా చెడ్డ అనుమానం మనిషి. ఇటేమో పాలతప్పేలా నిండుతూవుండగా భారతమ్మకళ్లు బఱ్ఱెమీద పడ్డాయి. దృష్టిదోషం తగిలి ఆకొసినిచుక్కా ఎక్కడ హరాయించుకుపోతాయోనని ఆమెగారి అనుమానం.

"పిన్నీ నెయ్యిముక్క వుంటే పోద్దూ - వారేమో ప్రయివేటు క్లాసు వుందని పరుగెత్తుకు పోయారు పట్టుకుని తెల్లవారకముందే" అన్నది భారతమ్మ. శారదమ్మ అడిగిన మాటకి సమాధానం చెప్పకుండా "ఇంట్లో సుశీల లేదూ" అని అడిగింది. సుశీల శారదమ్మ కోడలు. బఱ్ఱెకు పాలు తీసే సమయంలో దొడ్లోకి ఎవర్నీ రానివ్వకూడదనే వప్పందమొకటి ఆ సంసారంలో వున్నది. ఆ నిర్ణయాన్ని సుశీల వుల్లంఘించి వుంటుందని శారదమ్మకు కోపం కలిగింది.

గొల్లపూడి [illegible]

"సరేలే పిన్నీ లోపల సుశీలతోనే వేయించుకుంటాను—నీ చెయ్యి ఖాళీగా లేదుగదా" అంటూనే వంటయింట్లోకి దారి తీసింది భారతమ్మ.

శారదమ్మ మూతి తమాషాగా విరచి భారతమ్మ వంటయింటిలోకి ప్రవేశించేదాకా చూస్తూనేవుంది. ఆతరువాత మళ్లీ బఱ్ఱెదగ్గర చతికిలపడింది. ఇంతలోనే యీ సూక్ష్మ విరామాన్ని తనకు అనుకూలంగా అన్వయించుకొన్న ఆ బఱ్ఱె పాలు ఎగదేపి ఒక్క తన్ను తన్ని మొరాయించింది.

భారతమ్మను తిట్టుకుంటూ పరాకు చిత్తగిస్తూవున్న శారదమ్మ చేతిలోని పాలపాత్ర పట్టుతప్పి పడిపోయింది. తప్పేలా పాలూ అనవసరంగా నేలపాలు అయాయి. భారతమ్మ కళ్లు మంచివవునో కావో యీమెగారికి యిదివరలో సందేహం లవలేశం వుండవచ్చు గాక—కాని యీ ప్రత్యక్ష ప్రమాణంతో ఆ సంశయం నివృత్తి అయింది. ఇక్కడ యీ తతంగం ముగిసేలోగా సుశీల భారతమ్మకు నెయ్యి పోసి పంపించటం జరిగింది.

శారదమ్మ కస్సుబుస్సులాడుతూ వడమటింటిలోకి ప్రవేశించింది. సుశీల వెన్న తీసి మజ్జిగ వోత్చే నిమిత్తం పైకి ఎగరవేస్తూ వుంది.

"అవునే కోడలా ఆవిడగారికి నెయ్యి పోశావా" అన్నది శారదమ్మ.

ఆమె కంఠస్వరంలో కటుత్వంతో కూడిన వెటకారం కొట్టవచ్చినట్లుగా కనపడటంతో సుశీల తలయెత్తి అత్తగారివంక చూచి ఆశ్చర్యపోయింది.

"ఏమ్మా! ఏం భాగ్యానికి ఆ పాపిష్టిదాన్ని దొడ్లోకి మళ్లీరావు దేనికి?" అని సాగదీసుకుంటూ లాయరుప్రశ్న లాగింది శారదమ్మ. సుశీలకు అసలు సంగతి తెలియలేదు.

"ఏవిటి అత్తయ్యా ఎవర్ని గురించి మీరనేది?" అని అడిగింది.

"ఔరా యేమి సంగనాచివే - అదే ఆ పాపిష్టిది...భారతమ్మ."

"ఆ నేనా...దొడ్లోకి పంపానా?" అని తెల్లబోయింది సుశీల.

శారదమ్మ మాట అందుకొని అన్నది—

"అవును నువ్వే...ప్రతి విషయమూ నన్ను సంప్రతించి చేస్తున్నట్టు మహా ఆ భారతమ్మ అనుకోవద్దూ - అందుకని ఆవిడని పనిగట్టుకు పెరట్లోకి తోలావు."

సుశీలకు యింతటి అపనింద చేదు మందులా, గుటక దిగక బాధపెట్టింది. విపరీతమయిన ఆగ్రహమూ అభిమానమూ కలిగినా ఆవిడ బొత్తిగా యీకాలపు మనిషి కాకపోవటం మూలాన అలకని అదుముకొని అన్నది—

"నేనా...నేను పంపానా ఆ భారతమ్మని - భారతమ్మే చెప్పిందా."

"అవునే కోడలా - అదే చెప్పాలా... ముంజేతి కంకణంలా కనపడుతూవుంటేనూ"

"బావుంది వరస...ఆవిడేమో పడిపోయినట్టు పక్కగొందిలోనుంచి వస్తూవుంటేనూ"—

"అవుతే చూసే వూరుకున్నావన్నమాట. అయినా నిన్నని ప్రయోజనమేవుందిలే - నీకు శత పోరుపెట్టి చెప్పాను - బఱ్ఱెదగ్గర

# రచయితలకు మనవి

ఇటీవల కొందరు రచయితలు ఇదివరలో అచ్చయిన తమ రచనలను క్రొత్త రచనలన్నట్లు ఇప్పుడు తిరిగి మాకు పంపడం, కొందరు ఇతరుల రచనలను అన్యభాషలలోనుంచీ, తెలుగులోనుంచీ సంగ్రహించి స్వతంత్ర రచనలుగా పంపడం జరుగుతున్నది. వీరు సోదర రచయితలకు, మాకు జరుగుతున్న అపచారాన్ని గుర్తించడంలేదు. మాకు వచ్చే రచనలను, అనుమానంతో పరిశీలించడం రచయితలకుగాని మాకుగాని గౌరవప్రదం కాదని గుర్తించవలసిందిగా వీరిని ప్రార్థిస్తున్నాము. ఇందువల్ల చిక్కులకు లోనుకావచ్చునని ఇట్టివారు గ్రహించడంమేలు. ఇదివరలో మా పత్రికలోగాని, ఇతర పత్రికలలోగాని ప్రచురించబడిన వేలాది రచనలను చదివి జ్ఞప్తిలో ఉంచుకోడం ఏ సంపాదకునికైనా అసాధ్యమైన విషయమని ప్రత్యేకం చెప్పనవసరంలేదు.

అన్యథా సూచించినప్పుడు తప్ప, మాకు వచ్చే రచనలు మొదలైనవి, పంపినవారి స్వతంత్ర రచనలేననే, భావంతోనే మేము ప్రచురించడం జరుగుతుందని అందరూ గుర్తించ ప్రార్థన.

## మాకు కథలు, గేయాలు, చిత్రాలు, ఫొటోలు పంపే వారు ఈ క్రింది అంశాలనుకూడా గమనించ ప్రార్థన.

ప్రచురించనివానిని త్రిప్పిపంపగోరేవారు బుక్‌పోస్టుకు అవసరమైన స్టాంపులను, రచనలూ, చిత్రాలూ, ఫొటోలతోనే చేర్చిపంపాలి.

బుక్ పోస్టుకు అణా స్టాంపుకు తక్కువ కాకుండా పంపాలి.

రచనలను కాయితానికి ఒకే వైపున సిరాతో వ్రాసిపంపాలి.

ఫొటోలు కనీసం కార్డు సైజులో వుండాలి. నెగటివ్‌లు స్వీకరించబడవు.

చిత్రాలు ఇండియన్ ఇంకుతో వేసిపంపాలి. రంగుల చిత్రాలు స్వీకరించబడవు.

ప్రచురణ విషయాన్ని వెంటనే తెలియచెయ్యడం కష్టం.

నిరాకరించబడిన రచనలను త్రిప్పి పంపడానికి మాకు కనీసం ఒక మాసమైనా వ్యవధి అవసరం. ఫొటోలు, చిత్రాల విషయంలో యింకా ఎక్కువ వ్యవధి కావలసివుంటుంది.

ప్రచురించే వానిని గురించి ప్రచురించే ముందు మాత్రమే తెలియపరచగలము.

మాకు పంపిన రచనలను, ఫొటోలను, చిత్రాలను గురించి మా కార్యాలయం నుంచి ఎవ్విధమైన సమాచారమూ అందనిదే, వాటి ప్రతులను యితర పత్రికలకు పంపవద్దని ప్రార్థన.

రచయితలూ, చిత్రకారులూ, సహృదయంతో సహకరించగలరని విశ్వసిస్తున్నాము.

—సంపాదకుడు.

# పాపయ్య పాడిబర్రె కొన్నాడు!

నేను తగలడ్డప్పుడు ఎవర్నీ రానీమాకు సుమా అని -" అన్నది శారదమ్మ.

"ఇంతకీ యేవి జరిగిందని మీగు యింత యిదైపోతారూ?"

"ఏవి జరిగిందా...అదేమో అటు పోయి చూడు" అని దొడ్డిగుమ్మం చూపించింది అత్త.

సుశీల చూసి సంగతి అర్థంచేసుకుంది. "గెద కొత్తమనిషినిచూసి బెదిరింది గావున్ను అనుకున్నది ఆమె. మాట మార్చి తను చేసిన ఘనకార్యం చెవిని వేసేగాని ఆవిడ ఆగ్రహం తగ్గదని అనుకున్నది సుశీల- "అవునా అత్తయ్యా... ఆవిడకు పదిరోజుల కోమాటు యిదేవి వరసా అంట కమ్మని నెయ్యి పట్టుకుపోయి వెధవ డాల్డా నెయ్యి తగలమోయటం అందుకనే యీసారి బుద్ధి వచ్చేటని చేశాను-" అని ఆగింది అత్తగారు యేవిటంటుందో వినగలందులకు.

ఆ విషయం యేదో చెప్తమన్నట్లుగా చూసింది శారదమ్మ.

"నిన్న మావగారికి పూరీలు వెయ్యగా మిగిలిన నెయ్యి లేదూ.. అది కాస్తా గుమ్మరించి పూరుకున్నాను. లేకపోతే యేవిటి నాకు వళ్లు మండిపోయింది."

"వెలగబెట్టిన లేవుంది. ఆవిడ నలుగురిలోనూ యాగి చేసేస్తుంది" అంది శారదమ్మ.

"ఆ చేస్తుంది...అదీ చూద్దాం. గట్టిగా అంటే యేవోనమ్మా ఒక కాపు ఎక్కువ అయినట్టుంది అనమ్మ" అన్నది సుశీల.

శారదమ్మ యిహ నేమీ అనకుండా గూట్లో చెయ్యిపెట్టి గుప్పెడు పుప్పొడి తీసి చరచరా దొడ్లోకి పోయింది.

* * *

పాపయ్యగారు ఆవూరు హైస్కూలులో తెలుగు పండితులూ భారతమ్మగారి పెనిమిటీన్నూ. స్కూలు ఫైనలు పరీక్షలు దగ్గర్లో పడటంవల్ల ప్రయివేటు క్లాసు ముగించుకొని యింటికి చేరుకునేసరికి పన్నెండు కొట్టారు. ఆయన అనుష్టానాలు అయినవనిపించుకొని అన్నానికి కూర్చునేసరికి మరో అరగంట పట్టింది. భర్తకు వడ్డించి ఎదంగా పీటవేసుకుని కూర్చుంది భారతమ్మ పాపయ్య తీరిగ్గా కూర్చుని భార్య వంక చూసి అన్నాడు - "రామం యేడే" అని.

"ఎక్కడికి ఎగడ్డాడో...నాతో చెప్పి పోవటమంటూ వుంటేగా—దెబ్బలాడి వరిగెత్తాడు బజారువేపుకి" అన్నది భారతమ్మ.

"దెబ్బలాట దేనికి" ముద్ద పైకెత్తి అడిగాడు పాపయ్య.



వేసవి మధ్యాహ్న వేళ

ఫోటో: యస్. సి. జోగారావు, (కాకినాడ.)

"పెరుగు పొయ్యమన్నాడు అన్నాల దగ్గర...పొయ్య లేదనీ—"

"పోనీ కాస్త పొయ్యకపోయావా" అన్నాడు పాపయ్య ముద్ద నవులుతూ.

"ఎక్కణ్ణుంచి పోసేది? కొనేసే రెండ కాలదాయె...సవాపావులో బోడిపరాచిక మున్నట్టు—"

పాపయ్య తలయెత్తి భార్యవంక చూసి తల దించుకున్నాడు. తనకు పోయినవాళ్ళు పోగా మిగిలింది వొక కొడుకు. వాడు పెరుగు అడిగితే పోయించలేకపోయాడు తను. పొద్దున క్లాసులో తను పిల్లలకు చెప్పిన "ద్రోణపరాభవ"మనే పాఠ్యభాగం గుర్తుకు వచ్చింది. తనకు రోజుకు శేరుపాలు కొనే తాహతు లేదని పాపయ్యపంతులు అభిప్రాయం. అదిగాక ఆయన కానిడబ్బు రెండుసార్లు తిప్పి చూసుకొని మరొకరి హాస్తగతంచేసే మనిషి. తన జీవితాన్ని బహునియమబద్ధం చేసుకున్నాడు.

ఈవిధంగా మానసిక ఆందోళనతో మధన పడుతున్న పాపయ్యగారికి పప్పు ముద్ద ఎంగుచేతనో తెగవెగటనిపించింది. ఈసారి ముద్ద వాసన చూసి భారతమ్మని ప్రశ్నించాడు.

"పాడు నెయ్యి...ఎక్కడ పోయించు కున్నావూ?" అని.

"మీరేమో స్నానించుకు వెళ్ళిపోయారాయె పోయి శారదమ్మనడిగి గిన్నెడు అరువు తెచ్చాను" అంటూనే పొయ్యి సెగను పెట్టిన నేతిగిన్నె వాసన చూసి అన్నది—

"అసి దీని జిమ్మడా! వాడిన నెయ్యి తగలబోసింది."

"అంటే—" అన్నాడు పాపయ్య భార్యవంక చూసి.

"ఏదో పిండివంటబాపతు మిగిలిన నెయ్యి పోసింది. అసి దీని పిసినారితనం మండా" అన్నది. పాపయ్య మాట్లాడలేదు. సాక్షాత్తు విరూపాక్షుడిలా పోజు పెట్టి నాలుగు ముద్దలూ విషంముద్దల్లా మింగేశాడు నమలకుండానే. అంతే మళ్ళీ నెయ్యి వెయ్యమనలేదు అతను.

అందునిమిత్తం భారతమ్మ మనస్సు ఎంతో కష్టపెట్టుకుంది.

పాపయ్య భోజనం పూర్తిచేసుకొని కులాసాగా కునుకుతీస్తున్నాడు తనగదిలో. భారతమ్మ వాకిట్లో మాగాయముక్కలు ఎండబెట్టి కర్రపుచ్చుకు కాపలాకాస్తూ సావిట్లో కూర్చుంది. పొద్దున యీ సుమూహూర్తాన శారదావాసానికి తను వెళ్ళిందో యేమోగాని తరువాత ఆమె మనస్సు పట్టు తప్పిపోయింది. ఆతరువాత జరిగిన విషయాలు కూడా ఆమె మనస్సును మరీ చికాకుచేసేశాయి. రామం తొమ్మిదేళ్ళ వెధవ. వయస్సుకు మాలిన పట్టుదల అయితే వాడికి వుందిగాని ముక్కుపచ్చలారని కుర్రకుంక వాడు. పెద్దఅన్నంలో గేదె పెరుగు కావాలని ఎవరికుండదు. వాడేమీ కాని కోరిక కోరలేదు. పదేళ్లు లేని వెధవ—ఆ పట్టుదల ఎట్లా అబ్బిందో తెలియదు గాని రెండు దాటినా వాడు యింకా యింటి పట్టుకు చేరుకోలేదు. ఆ! వాడువచ్చుకు

# ★ పాపయ్య పాడిబర్రె కొన్నాడు ★

ఎక్కడికి పోతాడు—పినతల్లిగారింటికి పోయివుంటాడు.

భారతమ్మ యీ ఆలోచనలతో మునిగి వుండగా శారదమ్మగారి రథం ఏ మూల నుంచో దొంగున మాగాయ ముక్కలమీదికి లంఘించి నోటికి పట్టిన ముక్కలు ఫల హారం చెయ్యటమే కాకుండా సద్దుకొని లేచిన భారతమ్మ తన దరికి చేరుకోక పూర్వమే ఆ చాప నోటితో వక లాగులాగి పాలికపాలు ముక్కలు చెదరగొట్టి ఆపైన తన నాలుగు కాళ్ళకూ పనిచెప్పి అరుచు కుంటూ పరుగెత్తింది ఆ గొడ్డు. గేదెను శాప నార్థాలు పెట్టుకుంటూ ఆ ముక్కలు ఎత్తి చాపమీదవేసి యీసారి కర్ర చాపమీదే ముక్కలకు అడ్డంగావుంచి తిరిగివచ్చి సావిట్లో చతికిలపడింది ఆమె.

తను ఎన్ని బర్రెలు చూడలేదూ యిదివరలో. ఏమాట కామాటే చెప్పుకోవాలి గాని అవన్నీ శారదమ్మగారి గేదెముందు దిగదుడుపుకు కూడా పనికిరావు. రెండు శేర్లపాలు పట్టే చెంబు అవలీలగా నిండిపోవటం తను కళ్ళారా చూసింది. కాని ఒక్కందుకు తనకు చిత్రమవుతూంది. ఆ సుశీల అత్తనుమించిన కోడలు. మోహ మాటం యీషణ్మాత్రం లేకుండా వాడిన నెయ్యి పోసింది. ఏదైనా కానీగాక ఎవళ్ళకి యింత అతిశయం అంత మంచిదికాదు. పోయిన యేడు పరీక్షలికి శారదమ్మ వచ్చి నానాగడ్డీ కరిచి తన్ను బతిమాలపట్టేకదా రెండోకొడుకు పైక్లాసులో పడ్డాడు... వీళ్ళ బుద్ధి అంతా ఏరుదాటిం తరువాత బోడిమల్లన్నా అన్న రీతిగా వుంటుంది. ఛీ! బొత్తిగా కృతజ్ఞత అంటూ లేని జన్మలకి సిగ్గూ ఎగ్గూ అంటూ వుంటేగా. ఆ శారదమ్మ మొహాన్ని కొట్టినట్టు తనూ వొక పాడిబర్రె కొన్నదా చెప్పచ్చుకు కొట్టినట్టు వుంటుంది. కుర్రసన్నాసి కూడా మొహంవాచి కొట్టుకుంటున్నాడు. ఓ వందరూపాయలు మనవి కావనుకుంటే సామాన్యంలో ఒక బర్రె దొరకకపోదు. ఇంత సొమ్ము భర్త తేలిగ్గా వదలిపెట్టనిమాట అయితే సత్యమేగాని తను పూనుకుని వప్పించాలి. ఈ మగవాళ్లకి తమ వుద్దేశాలు అర్థంకావు. శారదమ్మకు పోటీగా తను యీ పథకం వేసినట్టు భర్తకు తెలిసిందా ససేమిరా అందుకు సమ్మతించడు. భర్త మనసుకు ఆనేటట్టుగా విషయ ప్రస్తావన చేయటంలోనే తన తెలివి వుపయోగించాలి.

భారతమ్మ యీతీరున ఆలోచిస్తూ వుండగానే పాపయ్య పగటినిద్ర చాలించి సావిట్లోకి వచ్చి వాల్చివున్న పట్టెమంచం మీద కూర్చున్నాడు. ఆపైన భారతమ్మ వంక చూసి—

"కాసిని మజ్జిగ తెచ్చిపెట్టు" అన్నాడు.

అప్పుడే గాడ్పులు మొదలెట్టాయి. వేడి గాలి యీ చెవులోనుంచి ఆ చెవులోకి కొడుతూవుంది. భారతమ్మ వడమటింటి లోకి వెళ్ళిన తరువాత "కాస్త వుప్పురాయి కూడా వెయ్యి" అని సావిట్లోనుంచే కేకే శాడు పాపయ్య.

భారతమ్మ యిచ్చిన నీళ్ళమజ్జిగతాగి వెనక గోడకి జారపడి విశ్రాంతి తీసుకుంటున్న భర్తనుచూసి అంది భారతమ్మ—

"ఇంటి మజ్జిగ అయితే బావుంటాయి."

పాపయ్య భార్యవంక చూసి అన్నాడు - "ఏదీ అబ్బాయి వచ్చినట్టులేడే" అని.

"పినతల్లిగారింటికి వేంచేసివుంటాడు - అయినా యింతలేసివాళ్ళకే యింతింత కోపాలా" అని అగి భర్తవంక చూసి అన్నది. "ఏమండీ" అని-

పాపయ్య తన భార్య ఏదో చెప్పాలని అనుకుంటూ వున్నట్టు గ్రహించాడు.

"నీ మనస్సులో బాధ గ్రహించాను - అయినా పిచ్చిదానా మనం యింత యాతనా పడేది వాడికోసమేగదా" అన్నాడు పాపయ్య.

"అవుననుకోండి... కుర్రకుంక అడిగితే ఒక్క పెరుగుబొట్టు వేయలేకపోయాను... నా చేతులు విరిగిపోనూ" అని భారతమ్మ తన్ను తాను తిట్టుకొంది దిగులుపడ్డ మొహంతో.

భర్తను తన వశవర్తునిగా చేసుకోటానికి భారతమ్మ ప్రయోగించిన ప్రథమాస్త్రం యిది—

అసలు విషయం తట్ట తగలబెట్టినట్టుగా చెప్పితే కొందరికి నప్పదు. ప్రతిమనిషికీ ఓ మూడ్ వుంటుంది. అది గ్రహించి దానికి అనుగుణంగా చెప్తేనేకాని ఫాయిదా వుండదు. భారతమ్మ యీవిధంగా చెప్పిందనుకోండి—

"నాకు పాడిబర్రెమీద మనసు పోయిందీ- యింటిలో పాడివుండటం పాడి.

చక్కగా కవ్వముచేత ధరించి గోపికలా తిప్పుకోవాలనీ వెన్నముద్దలుచేసి మీ చిరు పెదవుల కా మిసిమి ముద్దలు మింగబెట్టాలని మనసుగా వున్నదనీ భారతమ్మ అన్నదనుకోండి పాపయ్యలాంటి తెలుగు పంతులు అందులకు ఆహ్లాదమంది అంగీకరిస్తాడనుకోవటం ప్రస్తుతం పొరపాటే అవుతుంది. పాపయ్య ప్రబంధనాయకుడు కాదు - పదహారణాల తెలుగు పండితుడు. ఆయన యేమంటాడంటే—

"ఓసీ పిచ్చీ! రెండణాల పెరుగుతో సరసములు తీరుచుండ నూటయాబది రూప్యంబులు విలిచి పాడిబర్రె గొనుట పాడియె... చాలుం జాలు నేరని వినిరేని నోర్విప్పి నవ్వగలారు" అని కవి సార్వభౌములకు మెచ్చు వచ్చు భాషలో భార్యతో చెప్పటమే కాకుండా మళ్ళీ ఆమాట ఆ నోట వినటానికి అతను నూరయినా అంగీకరించడు. కాబట్టి కుర్రకుంక కోరిక మీలుగా వుపయోగించుకొని తనమనసులోని మాటను అన్యాపదేశంగా తీర్చుకోవటమే సముచితమని నిశ్చయించుకొన్న ఆ యిల్లాలు తద్రీత్యా పెనిమిటిని దగాచేయటానికే నిశ్చయించుకొంది.

పాపయ్య దిగాలుపడివున్న భార్యవంక చూసి అన్నాడు -

"తక్కువ నోములూ - ఎక్కువ ఫలాలు ఎక్కణ్ణుంచి వస్తాయి... అయినా దేనికైనా రోజు రావాలి"

భారతమ్మకు భర్తచెప్పిన యీ సబబు తృప్తి నివ్వలేదు.

"మనకష్టాలు యెప్పుడూ వుంటాయి... అయినా యిప్పుడు మన కేమంత యిది వచ్చిందో నాకేమీ తెలియటంలేదు. ఇంకొక్కయేడాది దాటితే వాడుమాత్రం అడగబోయి అడుగుతాడా... అయినా వాడి ముద్దూ ముచ్చటా - అదీనూ - "

తనకు తనయునిమీద గల మమత అనే లోపాన్ని గుర్తించి భార్య దాడిచేస్తూ వుందని అనుకున్నాడు పాపయ్య. అయితే ధనసంపాదనలో గల కష్టాల్ని గుర్తించిన వాడే డబ్బు తగలబెట్టడంలోవున్న తప్పిదాన్ని తెలుసుకోగలడు. ఇంతెందుకు తనకు తండ్రి తద్దినాలుమట్టుకు మిగిల్చి పోయాడు. తనకీనాడు రెండు ఎకరాల కొండ్ర వున్నదీ అంటే అదంతా రెక్కల కష్టంవల్ల సంపాదించినదే. వచ్చే ఎనభై రూపాయలజీతంతో నెలకో పాతికో పరకో మిగుల్చుకొని యిటు యీ పొలం కొనటమూ - అటు వెయ్యి రూపాయలకి యిన్సూరుచేసుకోవటమూ నెర వేర్చాడు అతను. తనుచేసే ప్రతిపనీ కుటుంబక్షేమం దృష్టిలో పెట్టుకుగాని చెయ్యడు. కోరికలు ప్రతివాళ్ళకీ వుంటాయి. ఆ కోరికలను జయిస్తేగాని యిటు ఐహికమూ అటు ఆముష్మికమూ అయిన ఆనందం అందుబాటు కాదు. అదీగాక కోరికలలోవున్న ఒక గొప్పదుర్గుణం యేమిటంటే ఆ కోరిక తీరగానే వేరే మరొకకోరిక కలుగుతుంది. అందుకనే పోతన్నగారు అన్నారు "ఆశ అనే తాడు చాలా నిడువుసుమా దానికి అంతంలేదు" అని. మరిన్నూ ఒక్క రూపాయ సంపాదించి అది కాస్తా ఖర్చు చేసి చేతులం దులుపుకు పోవటం

ఏమంత తెలివైనవని. ఆవిధంగా ఎవరైనా చెయ్యగల్రు. ఆ ఒక్క రూపాయిని ఖర్చు చెయ్యకుండా అట్టిపెట్టుకోవటం ఒక యెత్తూ, ఆ రూపాయకే మరో రూపాయిచ్చి రెండురూపాయలు చెయ్యటం ఒక యెత్తూను

"పోనీ ఒక నెలపాటు మరో అణా పెరుగు పోయించుకో ... ఆ పై సంగతి ఆలోచించుకోవచ్చు" అన్నాడు పాపయ్య.

భర్త ఒక మెట్టు దిగాడు. ఆవక్క మెట్టూ దిగి అక్కడ సావకాశంగా చతికిలపడ్డాడు. ఈ పరిస్థితుల్లో తను ఎంతో జాగర్తగా మాట్లాడితేగాని ఆయనగార్ని మరో మెట్టు దింపటానికి వీలువుండదు.

"అణా పెరుగా!" అని ఆశ్చర్యపోయింది భారతమ్మ.

"ఏమీ అర్ధణా దే చాలునంటావా" అన్నాడు పాపయ్య మళ్ళీ పై మెట్టు సగం యెక్కి.

"అణా పెరుగు ఎవరి ముక్కులో పొయ్యనూ -" అని సాగదీసుకుంటూ మూతి ముడిచింది ఆమెగారు.

పాపయ్యకు వీలుచిక్కింది యీ సమయంలోనే -

"అద్దిగదీ అసలు సంగతి బయటపెట్టవేమి యిందాకట్నుంచీ - ఆ కోరికేదో నీకేవుందని అఘోరించక నోరూ వాయీ లేని వాడిమీద నెపం దేనికి -" అన్నాడు భార్యవంక పరీక్షగా చూస్తూ.

తనఅంతర్యం భర్త గుర్తించాడని తెలుసుకున్న భారతమ్మ పాలిన చెక్కిళ్లు నల్లపడ్డాయి. ఇహ భర్తచేత తను తలపెట్టిన కార్యం పూర్తిచేయించటం తివిరి యిసుమున తైలంతీయటమే అవుతుంది. అయినా కార్యసాధకులు అంతలోనే నిస్పృహపడకూడదు. అందువల్ల భారతమ్మ యీ పరిస్థితుల్లో తన అవసరానికి పనికివచ్చే ఆగ్రహం మొహం మీదకి తెచ్చుకొని అన్నది—

"అవును మరి యీ సమయాల్లో ఎవరికైనా వుంటాయి—తోబుట్టువులున్న వాళ్ళకి తెలుస్తుందనుకున్నాను మరి."

పాపయ్య యీ పాశుపతాస్త్రం తాకిడికి తట్టుకోలేక క్షణకాలం వుక్కిరి బిక్కిరి అయాడు.

సంగతి యేమిటంటే భారతమ్మకు నెల తప్పి మూడు నెల్లు దాటింది!

పాపయ్య ఒక్క క్షణందాకా మాట్లాడలేకపోయాడు. తొమ్మిది సంవత్సరాల తరువాత భార్యకు మళ్ళీ కాన్పు వస్తూంది. కాపురానికి వచ్చిన పిదప తను ఆమెకో నగా నాణెమూ చేయించినపాపాన పోలేదు. ఇంతెందుకు నిజం చెప్పాల్సివస్తే పట్టుమని పాతిక పెట్టి భార్యకో పట్టుపుట్టమన్నా కొని తెచ్చియిచ్చిన సందర్భమున్నా లేదు. పాపయ్య మాట్లాడలేక—అహ అసలు మాటలు రాక తబ్బిబ్బు పడుతున్న సమయం చూసి భారతమ్మ అన్నది—

"చూడండి చాలాకాలంనుంచీ మనసులో ఓ కోరిక వున్నదండీ" అని ఆగి అన్నది "మీరు మరోలా అనుకోకుండా వుంటే చెప్తాను" అని భర్తవంక చూచింది ఆమె.

"అనుకోవటం దేనికి... కానీ" అన్నాడు అతను.

"అది కాదండీ ఒక్క గేదె పాడన్నా లేని యిల్లు ఏమి యిల్లు చెప్పండి."

పాపయ్య మాట్లాడలేదు. అసలు భారతమ్మ వేసింది ప్రశ్న కాదు......దీనికి జవాబూ లేదు. ఏతా వాతా జవాబు చెప్పినా అది తనకు వుపకరించదని అతనికి తెలుసు. అయినా భారతమ్మ యీ హేతువాదం ఎక్కడ నేర్చుకుందో అతనికి అర్థం కాలేదు. అలంకార సంగ్రహంలో అర్థాంతరన్యాసమనే అలంకారం ఒకటుంది. సామాన్యవిషయాన్ని ప్రత్యేక వివరణతో గానీ, ప్రత్యేక విషయాన్ని సామాన్య వివరణతో గాని సమర్థిస్తే ఆ అలంకారం అవుతుంది. అర్థాంతరంగా యీమెగారు అర్థాంతరన్యాసాలంకారాన్ని తనకు వీలుగా ఎల్లా వుపయోగించింది.

"ఒక్క గేదె పాడన్నా లేని యిల్లు ఏమి యిల్లు చెప్పండి."

"అందువల్ల మనకో గేదెపాడి కావాలి గదా" అనేది సామాన్య విషయం కావచ్చు. ఇది అసమానమైన అర్థాంతర న్యాసాలంకారమున్నా అవవచ్చు. దీనికి తనకు పనికి వచ్చే జవాబు లేదు. అందువల్ల యిట్టి సమయాల్లో మౌనమె విభూషణమని తెలిసిన పాపయ్య అవుననీ కాదనీ కూడా అనలేదు.

"గొడ్డూ గేదే శ్రీమహాలక్ష్మి అన్నారు" —అన్నది భారతమ్మ మళ్ళీ.

ఈ వచనానికి వ్యాఘాతం లేదు—అందువల్లనే పాపయ్య వులకనూ లేదు పలకనూ లేదు. భర్త పట్టిన మూగనోము భారతమ్మ సహించలేకపోయింది. తన యుక్తిప్రయుక్తులవల్ల అతనిని ఒప్పించి గేదె కొనిపించాలని ఆమె కోరిక. నోరు విప్పితే ఏమి చిక్కో అని అతనేమో శంకించుకు కూచున్నాడు.

"ఏమండీ మాట్లాడరూ?" అడిగింది ఆమె.

"నువ్వు చెప్పదలుచుకున్నదంతా చెప్పు—" అన్నాడు అతను.

"అవురా! అప్పుడు మీరు చెప్పే ఒక్క మాటా చెప్పిపోతారు అవునా—"

"మరి యిహనేం చెప్పేది నువ్వు చెప్పినవన్నీ నిజమే అవవచ్చు. అయినా నివ్రితిసం గాని మనది ఒక గేదెపాడికి సరిపడ్డ కుటుంబమూ యేమన్నానా—" అని పాపయ్య వూపిరి పీల్చుకు అన్నాడు—"ఒక్క మూడు అణాల పెరుగయితే మనకి ఎల్లిపోల్లానూ. నువ్వేమో వుత్తమనిషివి కావు బట్టెగొడ్డు అనగానే మాటలా— బోలెడు అరవచాకిరి చెయ్యాలి."

"మీకు యిష్టం లేకపోతే అన్నీ చెప్తారు. అయినా ఎవరింటి చాకిరీ ఎవరికి బరువు...యిహ కుటుంబమంటారా— మనకు సరిపోగా మిగిలినవి పారబోసుకోం కదా—"

ఈ మాటలు పూర్తిచేస్తూవుండగానే ఆ యిల్లాలి అంతరంగంలో ఒక ఆలోచన పరుగు లెత్తింది. ఈ విషయం ఏ తీరున బయట పెట్టటమా అని ఒకటి రెండు నిముషాలు నిశ్శబ్దంగా ఆలోచించుకొని, ఆ మాటలే నెమరుకు తెచ్చుకుంటూ నంగి నంగి అన్నది.

"ఇంతకీ నూటపాతిక పెడితే రెండో శేరున్నరా మూడో శేరున్నరా యిచ్చే గేదె దొరుకుతుంది"

"మూడు శేర్ల పాలు మనకు దేనికి అంటాను—యిందాకట్నుంచీ నా గోల అదే" అన్నాడు పాపయ్య. భార్య పన్నిన వలలోకి స్వేచ్ఛగా ప్రవేశిస్తూ.

"మీదంతా అదో అయోమయం అండీ మరీనూ - మీకు తెలియదుగాని ఆ శారదమ్మ ఒక్క గేదె పాడివల్లే ముప్ఫై రూపాయలు దాకా సంపాదిస్తూవుంది. ఆమాత్రం పాడి గేదె వుండాలిగాని కాస్త కుడీ ఎడమా వాడుకుంటే నెలకో నలభై చేసుకోవటం ఏమంత కష్టం."

"ఏమన్నావూ...మనం పాలూ పెరుగూ అమ్ముకోవటమా. పరువూ మర్యాదా అదీ ఆలోచించే యీమాట అంటున్నావా?" అడిగాడు అతగాడు.

"మన గేదెపాడి మనం అమ్ముకుంటుంటే పరువు బుగ్గయే ప్రమాదం ఏవుందీ - ఎవరి మోచేతికింద నీళ్లూ తాగటం లేదుగదా" అన్నది భారతమ్మ.

పాపయ్య యిందుకు వెంటనే జవాబు చెప్పలేకపోయాడు. అందుకు వొక ప్రబల కారణం ఏమిటంటే నిజంగా ధనసంపాదనకు మార్గమే దొరకాలిగాని మరి పరువు మర్యాదలకుపట్టే ప్రమాదాన్ని పాపయ్య అంతగా పట్టించుకునే మనిషి కాదు. భర్త తన ప్రణాళికకు వప్పుదల అవుతున్నట్టుగా గ్రహించింది భారతమ్మ.

"చూడండి నేనేమో వ్రత్తి చెప్పానని మీరు అనుకోవచ్చుగాక - పూటకి రెండు శేర్లు యిచ్చే గేదె 150 రూపాయలు పెడితే దొరుకుతుందంటారా."

"ఊఁ."

"ఇహనేం ఒక శేరు అయితే మనకి ముక్కా నోటా...యిహపోతే మూడు శేర్లు వుంటాయి; ఒక్క శేరునీళ్లు పోశామా నాలుగు శేర్లు అవునంటారా."

"అవును - గాని" భర్తను మాట పూర్తి చెయ్యనీకుండానే—

"చూడండి - నీళ్ళ పాలు శేరు పది

# ★ పాపయ్య పాడిబఱ్ఱె కొన్నాడు ★

అణాలు నాలుగుశేర్ల పాలు నలభై అణాలు. అంటే యెంతన్నమాటా——" అని అడిగింది ఆమె.

"రోజుకి రెండున్నరా....అంటే నెలకి ...డెబ్భై అయిదున్నర అవుతుంది. ఓయబ్బో" అన్నాడు పాపయ్య ఆశ్చర్యపోతూ.

"మరేమిటనుకున్నారూ...దాదాపు మీ జీతమంత" అన్నది భారతమ్మ సంతోషంతో పొంగిపోయి.

"మరేమో మనకి కమ్మని నెయ్యీ పెరుగూను...అన్నట్టు పొద్దున మీరు గొడ్డు మెతుకులు తినేసరికి నా ప్రాణం వుసూరుమంది.. వెధవది బజారు నెయ్యీ అద్దాన్నంగానే వుంటోంది - అంటే నెలకో పదో పదిహేనో ఖర్చు తప్పుతుంది."

"నీ మాటలయితే కోటలు దాటుతున్నాయి. అంతా లాభం సంగతే చెప్తున్నావు గాని ఖర్చుసంగతి మాటే లేదు." అన్నాడు పాపయ్య నిసలైన ఆర్థిక శాస్త్రవేత్తలా.

భారతమ్మకు భర్త యీ ప్రశ్న వేస్తాడని ముందే తెలుసు గాబట్టి తడుముకోకుండా వెంటనే అన్నది.

"పచ్చగడ్డి మోపు అరణాలు...చిట్టూ తవుడూ రోజుకో వీశ; ఎటొచ్చీ రోజుకు రూపాయకంటే ఖర్చు వుండదు - యింతే గదా" అని చప్పరించింది ఆవిడ - ఆ విషయాన్ని తేలిగ్గా తోసిపారేస్తూ.

భారతమ్మ చెప్పిన విషయాలు ఆలోచించగా సబబుగానే తోచాయి పాపయ్య పంతులుకు——

"మాశారూ...మరోమాట మరిచాను... పిడకలు వుంటాయి కాబట్టి కట్టెల ఖర్చు తగ్గుతుంది."

"సరేలే నువ్వింత మనసు పడుతుంటే నా కేమంటానికీ నోరు రావటంలేదు. చేసుకోలేవే అని నాబాధ" అన్నాడు పాపయ్య.

విజయగర్వంతో ఆనాడు భారతమ్మ మనస్సు మనస్సులో లేదు.

*  *  *

"ఇహ యీ బఱ్ఱెపాలివ్వదు. ఏకాడికో అమ్మేస్తేనే లాభం" అన్నది శారదమ్మ పెనిమిటికీ కొడుకుకూ అన్నం వడ్డిస్తూ.

పద్మనాభం భార్యవంక చూసిఅన్నాడు— "ఈని రెండునెల్లుకూడా కాలేదు. అప్పుడే యేవొచ్చింది"

"అదుగో పోయినశుక్రవారం పొద్దున్నే ఆ భారతమ్మ చూసింది. ఈ నాలుగురోజుల నుంచీ అర్ధశేరు తీసేసరికి ప్రాణాలు పోతున్నాయి. ధార అసలే లేదు. దృష్టి తగిలుంటుంది."

"పోనీ మంగలిరాముడుచేత తాడన్నా కట్టించావా" అన్నాడు పద్మనాభం.

"ఆ అదీ చేయించాను. అబ్బే ఏమీ లాభం లేదండీ ... పులవలు రుబ్బి పెడుతున్నాను. మొన్నేమో యింగువ మింగించాను ... అబ్బే యిహ లాభంలేదు"

"అర్థాంతరంగా బేరానికి ఎవరుచ్చుకుంటారు. కొన్నా నలభై యాభైరూపాయలు తక్కువ అడుగుతారు."

"మనమో నూటఅరవైకి కొన్నాముగదా నలభైఅయినాసరే తోసెయ్యండి. మరొకటి కొనుక్కుందాము" అన్నది శారదమ్మ.

"అమ్మటానికే యిస్తే అమ్మచ్చు ... మళ్ళీ యిటువంటిగేదె దొరకద్దా...పోయినయాతకి నిండా సంవత్సరం యిల్లు గడిపింది - ఏమో అమ్మాలంటే నాకు మనస్సు పోవటం లేదు" అన్నాడు పద్మనాభం.

వంటయింటిసంటుకోనివున్న సావిట్లో కూర్చుని మల్లెపూలచెండు కట్టుకుంటున్న సుశీల యీ సంభాషణ వింటూనే వున్నది - మెల్లిగావచ్చి ద్వారబంధంఆనుకునిఅన్నది—

"అత్తయ్యా ఆ భారతమ్మ గేదె బేరం చేస్తూ వుందిట..."

"తప్పేలానిండా పాలుచూసింది పాడిమీద మనసు పోయింది ... చూశారా .... నేనంటే కాదన్నారు ... తెలిసిందా" అన్నది భారతమ్మ. పద్మనాభానికి ఏవి తెలిసిందో యేమోగాని మొత్తానికి తెలిసినట్టుగా తల వూపాడు.

కొడుకు కుటుంబరావు తల్లివంక చూసి అన్నాడు -

"పోనీ యీబఱ్ఱె ఆవిడకే అంటగట్టేశేసరి తీరిపోతుంది."

"ఇస్తే కళ్ళనద్దుకు పుచ్చుకుంటుంది ... అయితే ఆ పాపయ్య శుద్ధ అనుమానాలమనిషి పాలుచూసి పుచ్చుకోవట మేవస్తే మనబఱ్ఱె యాభై కిచ్చినా పుచ్చుకోరు" అన్నది తల్లి.

"ఏమైనాగాని...అది వాళ్ళకి తోసేస్తే మంచిది" అన్నాడు కుటుంబరావు.

కోడలు యింకా ద్వారబంధాన్ని ఆనుకునే వున్నది. భారతమ్మ నెయ్యి అరువు నిమిత్తంవచ్చిననాడు తట్టిన ఆలోచనలాంటి ఆలోచన మరొకటి ఆవిడ మనసులో మెదలటంతో వెంటనే అన్నది -

"ఆ భయం అక్కర్లేదు అత్తయ్యా - పాలుతీస్తుండగా యిదివరకే చూసింది కాబట్టి భారతమ్మ గేదను ఆపళంగానే కొనుక్కుంటుంది ... ఆవిడదిష్టి ఆవిడమీదగానే పోవాలి"

సుశీల ఆలోచన ఆ యింట్లో మొదట్లో ఎవరికీ అర్థంకాలేదు. అయితే ఆరాత్రి కుటుంబరావుతో మాత్రం "ఆవిడ దిష్టి ఆవిడ మీదగానే పోవాలి" అని అనటంలో గర్భితమైన అర్థం చెప్పటంతో అతగాడు ఆమె తెలివి తేటలకి అమితంగా మురిసిపోయాడు.

*  *  *

ముందు దూడను న్యూలు కుర్రాడు వొకడు నడిపించుకు వస్తూండగా పాపయ్య బఱ్ఱెను తోలుతూ తలవాకిట నిలబడివున్న భార్యనుచూసి అన్నాడు.

"అదుగో ... అరోకలి అడ్డంటా లాగు" అని.

భారతమ్మ రోకలి సద్దింది. పాపయ్య బఱ్ఱెను దానిమీదుగా గెంతించి దొడ్లో కట్టేసిన అనంతరం భార్య యిన్ని పసుపునీళ్ళయితే గేదెమీదుగా దిగదుడిచి పారబోసింది. ఆతరువాత వంటయింటిలో నాలి పొయ్యి తవ్వుతున్న భర్తదగ్గరికిపోయి అన్నది -

"ముందు వో రెండు ఎండు గడ్డిమోపులు అవుసరం - తాతయ్యగారి బూసయ్యనన్నా అడిగి పట్టించుకురండి"

"అల్లాగేలేగాని యీలోపల అటకమీద కర్రలున్నాయి. ఆ రాజుగాడిని ఎక్కించి నేవళంగావున్న కర్ర ఒకటి దింపు. కవ్వానికి కావల్సివస్తుంది." అని చెప్పితనపనిమీద బయటికిపోయాడు.

భారతమ్మ కర్ర దింపించి ఒకపక్క చెక్కిస్తూవుండగా వుత్తచేతులు వూగించుకుంటూ పాపయ్య వచ్చేశాడు ... ఆమె ప్రశ్నార్థకంగా భర్తవంక చూసింది.

"తాతయ్య కవతగాడు పొలం ... కి పోయాడు. తెచ్చే మనిషి లేక సాయంత్ర



శ్రీమతి రమా హరిహరన్, ప్రసిద్ధ వైణికురాలు. సిలోన్ రేడియోలో జూలై 12 రాత్రి 7-30. కు ఈమె వాద్యం ప్రసారించబడుతుంది.

కొంతలా వచ్చాను. మూడు రూపాయలు ఇచ్చివచ్చాను." అన్నాడు.

"వెధవ గడ్డిమోపులు మూడు రూపాయలా! పోనీలెండి బజారుకు వెళ్ళి ఒక మోపు పచ్చిమేతా, ఓ మరకం పులవలూ, చిట్టూ పట్టుకురండి" అని భర్తను పురమాయించి పంపింది భారతమ్మ.

భారతమ్మ కొన్న పాడిబఱ్ఱె మోపు పచ్చిమేతా మెక్కింది. పులవలు రుబ్బి కుడితి పెడితే కడివెడయితే తాగింది. శుభ్రంగా పెయ్యదూడకు పాలు చేపింది. పాపయ్య పాలు తియ్యను కూర్చోగానే విశ్వాసం లేకుండా ఆ గొడ్డు ఒక్క తన్ను తన్ని పాలతప్పాలా ఎగరదన్నింది!

"అయ్యో! బఱ్ఱెకు దాపట కూర్చోకూడదేమోనండీ" అంటూ వెలపలపక్క కూర్చోబోతున్న భారతమ్మని లోగడ విరోధం మనసులో వుంచుకొని గావల్నే బుసకొట్టి తరిమేసింది ఆ చతుష్పాత్తు!! భారతమ్మ కొడుకు రామంచేత శారదమ్మకు కబురు పెట్టింది...బఱ్ఱె కొత్తచేసిందేమో కొంచెం కష్టమనుకోక వచ్చి రెండు పూటలు పాలు తీసిపెట్టమని—అయితే వాడిచేతే తిరుగు జవాబు పంపింది శారదమ్మ......తనేమో వెలుపల వుంది....సుశీలేమో పొరుగింటికి రాదుట.

వరసాగ్గా మూడు రోజులూ బఱ్ఱె పాలు యివ్వకపోవటం అటుంచి వరసాగ్గా మూడు తాపులు తన్నింది పాపయ్యగారిని. అయిదోరోజు భారతమ్మ స్వయంగా వెళ్ళింది శారదమ్మను పిలుచుకువచ్చే నిమిత్తం. సుశీల పిలుపు అందుకొని అన్నది-

"అత్తగారు జరంతో మూలుగుతోంది.... నిన్నటేనుంచీ మూసినకన్ను ఎరగదు" అని.

వాళ్ళచేతా వీళ్ళచేతా తీయించబోయినా బఱ్ఱె పాలుచేప కూడా తన్నటమే నేర్చుకొంది యీ అయిదు రోజుల్లోనూ. విసుగెత్తిన పాపయ్య వరుసగా సామదానభేద దండ నీతులు ప్రయోగిస్తూ ఆ గొడ్డుమీద ప్రయోగించినా గిద్దెడు పాలు దానిదగ్గర నుంచి రాబట్టుకోలేకపోయాడు. క్లాసులో పాఠం చెప్పుతున్నా ఆయన ధ్యాస అంతా పాడిబఱ్ఱెమీదే వుండిపోయేది. మరో వారం రోజులకి బఱ్ఱె మాలిమి అయింది. అయితేనేమి అర్ధశేరు పాలకన్నా ఒక్క బొట్టు అధికంగా రాల్చలేదు. నెల రోజులు చూసినా ఆ పాలు బొటాబొటిగా సరిపోవటమూ ఆ నెల ఖర్చు ముప్ఫై రూపాయలు పెరగటమూ పాపయ్య పంతులు గుండెల్లో రైళ్లు పరుగెత్తాయి. ఎందువల్లనో యేమోగాని భారతమ్మకు కూడా పాడిమీద మోజు తగ్గిపోయింది. చచ్చే చాకిరితో ఆమె నలిగిపోవటం పాపయ్యకు మరీ ఆందోళన అధికమైంది.

"వధవది తద్దినం కొనుక్కున్నావు. ఇప్పుడు ఏమంటావో చెప్పు" అని సంజాయిషీ అడిగాడు పాపయ్య. ఇందుకు ఆమె మట్టుకు ఏవి చెప్పగల్దు? అనుకున్న అంచనాలు తలకిందులైతే ఎవరు మాత్రం ఏవి చేస్తారు! గొప్ప గొప్ప కొమ్ములు తిరిగిన ఆర్థిక శాస్త్రవేత్తలు కూడా ముందు ఘనంగా అంచనాలు ఆశ చూపి చివరికి లోటు బడ్జెటు చూపుతున్న రోజులివి.

నేనేమన్నా కలకన్నానా—శారదమ్మ యిల్లా దగాచేస్తుందని...అదేమి చిత్రమో నేను చూస్తూవుండగానే రెండు శేర్ల పాలూ అలాగ్గా తీసింది ఆవిడ. ఎదురుగుండా చూసినదాన్ని ఎల్లా కాదనుకూ. మన నష్టం గాదు...మనదనష్టమైపోనూ" అని తిట్టి ఆమె ఎంతో కష్టపెట్టుకుంది. పాపయ్య విసిగిపోయాడు. ఒకపక్క బఱ్ఱె తిండి ఖర్చు తారామండలానికి ఎగబాకుతోంది. ఇటుచూస్తే దానివల్ల వచ్చే రాబడి అతలమైపోయింది. చూస్తూ చూస్తూ వుండగానే భారతమ్మ చిక్కి సగమయింది. చివరికి డబ్బూ పోయే...శనీ పట్టే అన్నట్టుగా వుంది వ్యవహారం.

"ఇదుగో యీ బఱ్ఱె వచ్చినప్పట్నుంచీ మనకు అన్నిందాలా శని దాపురించింది. దీన్ని అయినకాడికి అమ్మేస్తేనేగాని మనం మనలోకంలో పడం....దీని మొహాన నూటయాభై రూపాయలు తగలేయించావు" అన్నాడు పాపయ్య.

బఱ్ఱె పీడ విరగడయితే అంతే చాలు అనుకునే స్థితికి వచ్చింది భారతమ్మ కూడా.

"అవును మరి......నాకూ భయంగానే వుంది బాబూ...బిడ్డ వచ్చిన వేళా గొడ్డు వచ్చిన వేళా అని—"

* * *

పాపయ్య తొందరపాటువల్ల ఆ బఱ్ఱెని ఓ పాతిక తక్కువచేసి తిరిగి పద్మనాభమే కొనుక్కున్నాడు.

ఆరోజు రాత్రి కోడలు సుశీల కేకవింటూ [illegible] గిన్నెలా ఆ బఱ్ఱెపాలతో పొంగి నిండి కాని నిండా రెండుశేర్ల పాలూ అత్తగారికి చూపించి అన్నది—

"మాశారా అత్తా. గొడ్డు శని భారతమ్మ తిట్లతోనే పోయింది" అని! ఏమైతేనేమి యీ బేరంవల్ల శారదమ్మకు పాతికరూపాయలు లాభమూ ఓ నెల పాలు ఖర్చూ తప్పింది. ★

సీరియల్

# ఉదయ కిరణాలు

పోతుకూచి సాంబశివరావు

## 5

రాత్రి పదిగంటలకు సోమయాజులు టెలిగ్రాం అందుకున్నాడు నరసింహం వస్తున్నాడని ప్రకాశాన్ని స్టేషనుకు తీసుకు రావలసిందని ఎందుకు ప్రత్యేకం వ్రాశారా అని ఒకసారి తీవ్రంగా ఆలోచించాడు కోటిపల్లి వెళ్లడానికి కాకినాడలో దిగి బస్సు ఎక్కడమే సులువైన పని కాకినాడలో దిగే నరసింహం తన యింటికి రాదల్చుకో లేదా? ప్రకాశాన్ని ఎందుకు స్టేషనుకు తీసుకువెళ్లాలి? అయినా కొడుకును చూడాలనే కోరిక కలిగి తీసుకు రమ్మని వ్రాసి ఉండవచ్చు అనుకుని మనస్సు సరిపెట్టుకున్నాడు సోమయాజులు

ఆ రాత్రి తక్షణం రాధమ్మ యింటికి వెళ్లి సంగతి చెప్పాడు సోమయాజులు నిద్రపోతున్న ప్రకాశం, చిట్టిబాబు యీ వార్త విని లేచి కూర్చున్నారు ఆనందంతో, మర్నాడు ప్రకాశం కోటిపల్లి వెళ్ళి రెండు రోజులు గడపడానికి సన్నాహాలు చెయ్యాలని నిశ్చయించుకున్నారు రాబోయే తండ్రిని కలుసుకునే సంతోషంతో ఏవేవో తమాషాగా ఆలోచిస్తూ రాత్రి సరిగా నిద్రపోలేదు ప్రకాశం.

మర్నాడు రెండు గంటలకు రైలు కాకినాడ వస్తుంది నరసింహం అందులోనే రావాలి ప్రకాశం ఒక సంచిలో రెండు జతలబట్టలు వేసుకుని సోమయాజులును అనుసరించాడు రైలుస్టేషనుకు 'నరసింహాన్ని ముందు ఇక్కడికి తీసుకురా తర్వాత వీ సాయంత్రమో వీలుచేసుకుని కోటిపల్లి వెళ్లవచ్చని చెప్పు' అంటూ రాధమ్మ మరిదికి సలహా యిచ్చింది సరే అని తల ఊపుతూ వెళ్ళిపోయాడు సోమయాజులు

అనుకున్న టైముకు ఆలస్యం కాకుండా ఆనాడు రైలు, స్టేషనులో ఆగింది నరసింహం, తెల్లటి పంచ, చొక్కా, ఒంటిమీద కండువా మొదలైన దుస్తులతో దిగాడు ప్లాటుఫారంమీద కనిపించగానే కళ్ళతో వెతుకుతున్న సోమయాజులుతో 'అదుగో నాన్న' అంటూ కేక వేశాడు ప్రకాశం, 'తండ్రిని కలుసుకోవాలనే ఆత్రుతతో సోమయాజులు ఎదురుగా వచ్చే నరసింహంవైపు నడిచాడు నరసింహం గంభీరంగా ముఖంపెట్టి ఏమీ మాట్లాడలేదు సోమయాజులు కూడా సంభాషణ ఎలా మొదలు పెట్టాలా అన్న తికమకలో పడ్డాడు దగ్గరకు వచ్చిన ప్రకాశం చెయ్యి పుచ్చుకుని తనవెంట నడిపించుకుని రైలు స్టేషను బైటికి వచ్చాడు నరసింహం

'కారు స్టాండుకు వెళ్ళాలి రెండు రిక్షాలు మాట్లాడాలి సోమయాజులూ!' అని నరసింహమే ముందుట కదిపాడు సంభాషణ

'ఈ పూటకు మా యింట్లో భోంచేసి, సాయంత్రం కోటిపల్లి వెళ్ళవచ్చుతే' సోమయాజులు నసిగాడు

'అల్లా కాదు ఇప్పుడు రావడానికి వీల్లేదు ఇంటికి వెళ్లిపోవాలి' అంటూ ముఖం చిట్లిస్తూ 'ఏయ్! రిక్షా' అని పిలిచాడు రిక్షావాళ్లు తక్షణం నరసింహం చుట్టూ మూగారు

'కారు స్టాండుకు' అంటూ రెండు రిక్షాలను సిద్ధం కమ్మన్నాడు నరసింహం ఇంక మాట్లాడడానికి టైములేక సోమయాజులు రిక్షా ఎక్కాడు

ఒక రిక్షాలో ప్రకాశం, నరసింహం కూర్చున్నారు ప్రకాశానికి తండ్రితో ముందు ఎలా మాట్లాడాలో అర్థం కావటం లేదు

'బాగా చదువుకుంటున్నావా?' నరసింహం కొడుకువైపు నవ్వుతూ పలకరించాడు

'ఆఁ' అన్నాడు ప్రకాశం నవ్వుతూనే

'పరీక్ష లెప్పుడు?

'ఇంకా నెలరోజులున్నాయి'

నరసింహం మళ్ళీ ఏదో ఆలోచిస్తూ మౌనం వహించాడు రిక్షాలు బస్సు స్టాండుకు చేరాయి

'రెండుగంటలయింది పోనీ భోంచేసి వెడుదువుగాని' అన్నాడు నసుగుతూ సోమయాజులు

'మళ్లీ వస్తాగా' అంటూనే, రిక్షావాళ్లకు డబ్బు చెల్లించి, కోటిపల్లి వెళ్ళడానికి సిద్ధంగావున్న కారు ఎక్కి కూర్చున్నాడు నరసింహం

'అయితే మరి నే యింటికిపోతా' సోమయాజులు తన పని పూర్తయిందన్నట్లు నరసింహంవైపు చూశాడు

'మంచిది' అని నరసింహం చెయ్యి ఆడించాడు అది చూడకుండానే ఇంటివైపు నడక సాగించాడు సోమయాజులు

దారిలో సావకాశంగా మజిలీలు చేసుకుంటూ కోటిపల్లి కారు ఆరుగంటలకు గమ్యస్థానం చేరింది కారులో ప్రకాశం కాని, నరసింహం కాని ఒకరి నొకరు గురించి మాట్లాడుకోలేదు బస్సులో కనిపించిన ఒకరిద్దరు కోటిపల్లి ఆసాములు 'ఏమండోయ్! పంతులుగారు ఎప్పుడొచ్చారు?' అంటూ పరామర్శించారు నరసింహాన్ని 'ఇప్పుడే' అని ఆసాములతో యింకేమీ మాట్లాడకుండా మౌనం వహించాడు నరసింహం

బస్సు దిగి సరాసరి ఇంటివైపు గబగబ నడక సాగించాడు నరసింహం, ప్రకాశంతో దారిలో ఎరుగున్న మనుష్యులు నరసింహంవైపు తేరిపార చూశారు కొందరు పలకరించారు మరికొందరు గుసగుసలాడుకున్నారు పోచుగుండంలోంచి నీళ్లు తెచ్చుకుంటున్న ఆడవాళ్లు ఇతన్ని చూసి ఏవో చెవుల్లో కొరుక్కుంటూ దవడలు నొక్కుకున్నారు,

సూర్యుడు అస్తమించాడు పంచాయితీ నౌకర్లు వీధి లాంపులు వెలిగిస్తున్నారు 'బాబుగారొచ్చారే!' అని వాళ్ళనుకున్న మాటలు నరసింహం చెవుల్లో పడ్డాయి ఎవరివైపు చూడకుండా బుర్ర వంచుకుని ఇంటి గుమ్మంలోకి వచ్చి ఆగాడు

వీధిలో అరుగుమీద కాంత కూర్చొని తాటాకులతో బొమ్మలు చేసి, ఏవో గుడ్డలు చుట్టబెడుతోంది. సాంబ

ఆటలాడుకుందుకు బైటకు వెళ్ళిపోయాడు తండ్రిని, అన్నయ్యను చూడగానే చటుక్కున గంతేసి తండ్రి వైపు పరిగెత్తింది శాంత. నరసింహం శాంతను చేతులోకి తీసుకుని ఎత్తుకున్నాడు

'బాగా అల్లరి చేస్తున్నావా?' నరసింహం అడిగాడు.

'నువ్వు వెళ్ళిపోయాక నేనేం అల్లరి చెయ్యటంలేదు నాన్నా' అమ్మేం! మరే మోనే..... ఏడుస్తోంది' అంటూ నసిగింది శాంత

'అలాగా' అంటూ శాంతను క్రిందకు దించాడు. ఏవో విషాదరేఖలు అతని వదనంలో అల్లుకున్నాయి.

ఈలోపుగా "అమ్మా! నాన్న అన్నయ్య వచ్చారే" అంటూ శాంత వంటింట్లోకి పరుగెత్తింది.

భర్త వచ్చారని విన్న మాణిక్యం ఒక్కసారి ఆనందంతో పరవశురాలై ఏడుస్తూ పడుకున్న మనిషి గబగబ లేచి వరండాలోకి వచ్చింది నరసింహం కుర్చీలో కూర్చున్నాడు మౌనంగా. ప్రకాశం ఆప్రక్కనే మౌనంగా మంచం మీద కూర్చున్నాడు బట్టల సంచీ క్రిందపెట్టుకుని మాసిన చీరతో శోకదేవతలా ఎదురైన భార్యను చూసి తల వంచుకున్నాడు నరసింహం. గబగబ దొడ్లోకి వెళ్లి మాణిక్యం భర్త కాళ్లు కడుక్కుందుకు చెంబుతో నీళ్లు తెచ్చి యిచ్చింది. నరసింహం ముఖం, చేతులు కాళ్లు కడుక్కున్నాడు.

హృదయంలో ఏదో ఆవేదన, ఆత్రుత, కంగారు, బాధ, ఆనందం, అన్నీ ఒక్కుమ్మడి పెలుబికాయి మాణిక్యానికి ఏం చేయాలో తోచలేదు దొడ్లో పొయ్యి అంటించి వేడి నీళ్లు కాచింది. శాంతను చాటుగాపిలిచి ప్రక్కింటి కంసాలి వాళ్లయింట్లో బియ్యం బదులు తెమ్మని పంపింది. దొడ్లో కాసిన దొండకాయలు కొన్ని కోసి కూరచేద్దామని ఉపక్రమించింది

ఇంతలో ఏదో గబుక్కున జ్ఞాపకం వచ్చింది మాణిక్యానికి గబగబ గదిలోకి వెళ్ళి అద్దంలో ముఖం చూసుకుంది తిలకం లేకుండా పీడపోయిన ముఖం కనిపించింది. భరణిలోని కుంకం తీసుకుని తిలకం దిద్దుకుంది. తలకు నూనె రాసుకుని, పాపిడితీసుకుని ముడి వేసుకుంది

శాంత బియ్యం తేగానే వంటప్రయత్నంలో నిమగ్నమయింది మాణిక్యం.

మాణిక్యం ముందు పలకరిస్తుందను కున్నాడు నరసింహం కాని లేచిపోయి తిరిగివచ్చినభర్తతో సంభాషణ ఎలా మొదలుపెట్టాలో అర్థంకాక లోపల ఆనందంతో మౌనంగా ఉంది మాణిక్యం.

ఆయింట్లో ఏదో అపరిచితవ్యక్తి అడుగుపెట్టి,ఎవరికోసమో నిరీక్షిస్తున్నట్లుకూర్చున్న నరసింహం శాంత పుస్తకాలు ఏవో తిరగేస్తున్నాడు. అరగంట దాటినా మాణిక్యం వచ్చి పలకరించలేదు.

తప్పు తనది కనక తనే ముందు ప్రసంగం చెయ్యాలనుకున్నాడునరసింహం మౌనంగా ఉన్న తండ్రితో ప్రకాశం, శాంత, ఏమీ సరదాగా కబుర్లు చెప్పలేకపోయారు.

'అమ్మ ఏంచేస్తోంది' శాంత నడిగాడు తండ్రి.

'వంట వండుతోంది'

కుర్చీలోంచి లేచి మెల్లిగా నడుస్తూ వంటింటి గుమ్మంముందు నుంచున్నాడు. కత్తిపీటతో పచ్చిమిరపకోస్తూ, భర్తరాక గమనించింది మాణిక్యం. గతించిన బాధల రోజులు జ్ఞాపకంవచ్చి ఒక్కుమ్మడి వెక్కి వెక్కి ఏడ్చింది. భార్య ఆవేదన చూడగానే నరసింహానికికూడా దుఃఖం ఆగలేదు. కాని ఎలాగో ధైర్యం తెచ్చుకుని గంభీర మైనాడు.

"వెఱ్ఱిదానా! ఎందుకీ ఏడుపు?"

మాణిక్యం ఏడుపు మరీ ఎక్కువైంది

గిన్నెలో ఉన్న దొండకాయ ముక్కలు చూశాడు నరసింహం

"అయితే యీ రాత్రి దొండకాయ వేపుడుకూర అన్నమాట! పచ్చడి కూడా ఏమన్నా చేస్తున్నావా?" హాస్యం మొదలు పెట్టాడు నరసింహం

మాణిక్యం దుఃఖం దిగమింగుకుని కళ్ళు తుడుచుకుంది భర్త యింకా అక్కడే నుంచున్నట్లు కనిపించాడు.

"జిహ్వ చచ్చిపోయిందిలే యిన్నాళ్లు పెళ్ళాన్ని వదిలేసినవాడి గతే అంతే!"

మాణిక్యం లోలోపల నవ్వుకుంది

"ఈ వేళ గెలులో బయలు దేరింది మొదలు నీ దృష్టే నే! అసలు తిరిగి వచ్చేయడానికి కారణం తెలుసా? నువ్వు కొంప తీసి ఎవరితోనన్నా లేచిపోతావేమో అని భయం!!" నవ్వుతూ ఓరగా చూశాడు నరసింహం భార్యవైపు.

"ఊఁ - చాల్లెండి" కొంచెం కోపంతో, వచ్చే నవ్వు కొంగుచాటులో అపుకుంటూ చిరాకు చూపించింది మాణిక్యం.

ప్రక్కనే నుంచుని యీ సంభాషణలు చోద్యంగా వింటున్న ప్రకాశం, శాంత, నోటికి చేతులు అడ్డుపెట్టుకుని నవ్వుకుంటున్నారు.

'మూర్ఖుని పెలవా?' అంటూ కటువుగ భంగిమలో మాణిక్యంవైపు చూశాడు నరసింహం.

"మూర్ఖ్రండి" నవ్వింగి తల వంచుకుని మాణిక్యం.

'ఒసే శాంతా! ఇన్నాళ్లు అమ్మ ఒక్కత్తె ఇంట్లో ఏం చేస్తోంది?' ప్రశ్నించాడు శాంతను తండ్రి.

'చెబుతోంది నాన్నా' సాగదీసుకుంది శాంత.

'ఛస్! అబద్ధమాడుతు' నాలుక కొరికినట్లు నటించాడు నరసింహం!

"నిజమే నాన్నా!" శాంత తను చెప్పిన మాట అతురాలా సత్యమన్నట్లు ముఖం పెట్టింది.

"ఇదిగో! నువ్వు అబద్ధమాడుతున్నావు! జిలేబీ, బూంది, పకోడీ, మైసూరుపాకు, హల్వా అన్నీ చేసుకుని లొట్టలు వేసుకుంటూ తినలేదూ ఇవ్వాళ?"

"అంతా అబద్ధమాడుతున్నావు నాన్నా" నవ్వింది శాంత.

"ఏరా ప్రకాశం అంతేనా" కన్ను గీటాడు నరసింహం.

"నిజం. అంతే నాన్నా" ప్రకాశం తండ్రి మాటలకు తాళం వేశాడు.

నరసింహం ఫక్కున నవ్వాడు.

మాణిక్యం కూడా నవ్వింది.

"వంటయింది. నీళ్లు పోసుకుని భోజనానికి లేవండి" మాణిక్యం పిలుపు వినగానే "చిత్తం. తమ విధేయుణ్ణి" అంటూనే "మీరుకూడా భోజనానికి లెండర్రా" అంటూ ఆజ్ఞాపించాడు నరసింహం.

ఇంతవరకు భార్యను సముదాయించాలనే గొడవలో నిమగ్నమయి లేకున్న నరసింహానికి సాంబు కనిపించలేదు ఇంట్లో.

'సాంబు ఏడీ?'

"ఆటలకి వెళ్ళాడు" మాణిక్యం సమాధానం ఇచ్చింది వంటిల్లు సవరించుకుంటూ.

నరసింహం స్నానం పూర్తి చేసుకుని రాగానే సాంబు ఆటలు పూర్తి చేసుకుని ఈలలు వేసుకుంటూ యింటికి చేరాడు. ఎదురుగా తండ్రిని చూడగానే అతని పైకి బంతిలా గెంతాడు. చేతులు చాచి ఒక్కసారి ఎత్తుకుని ముద్దు పెట్టుకున్నాడు నరసింహం.

"ఎప్పుడొచ్చావు నాన్నా?"

"ఇప్పుడేరా!"

"నాన్నా! నువ్వు తీర్థయాత్రకు వెళ్ళావంటా?"

"ఏడిసేరు వెధవలు! ఎవరన్నారు?"

"మరి ఎక్కడికి వెళ్లావు నాన్నా"

"మీ అవధానిమామయ్య ఊరు వెళ్లా"

"అమ్మకూడా నిన్నుగురించి సోమయాజులు పెద్దనాన్నతో ఎక్కడికో వెళ్ళిపోయేవు అంది"

"అమ్మమాటలు నమ్మకు. ఉత్తి దొంగ మనిషి" నరసింహం అన్నమాటలకు పిల్లలంతా పకపకా నవ్వారు.

వడ్డించిన విస్తళ్ళముందు పిల్లలతో కూర్చున్నాడు నరసింహం.

"ఎన్నాళ్లు ఎన్నాళ్లకూ మళ్ళీ నీచేతి భోజనం!" నటుడిలా చేతులు త్రిప్పాడు నరసింహం.

"ఊ. చాల్లెండి. మీ వేళాకోళం" మాణిక్యం మూతి త్రిప్పుకుంది. నవ్వుతూ ముద్ద నోట్లో పెట్టుకున్నాడు.

నరసింహం ప్రక్కనే పీట వేసుకుని విసనకర్రతో నరసింహానికి విసరబోయింది మాణిక్యం.

"హాయి! హాయి! స్వర్గం చూస్తున్నానురా దేవా! యీ చల్లగాలికి" నరసింహం ఆనందంతో కళ్లుమూసుకుని నటించాడు.

"ముందు భోంచెయ్యండి. తర్వాత వేళాకోళాలు ఎలాగా ఉన్నాయిగా."

"తమ విధేయుణ్ణి" ఉక్కిరిబిక్కిరిగా రెండు ముద్దలు నోట్లో కుక్కుకున్నాడు నరసింహం. ఈ హాస్యంచూసి పిల్లలు కడుపు చెక్కలయ్యేటట్లు నవ్వుతున్నారు.

"ఏమిట్రా వెధవనవ్వులు" చిఱుకోపంతో కసిరింది మాణిక్యం.

నరసింహం ఎక్కడికి వెళ్లాడో, సంగతులేమిటో అడగాలని మాణిక్యానికుంది లోపల.

"ఏమండీ! దేశయాత్ర బాగా సాగిందా" మాణిక్యం నవ్వుతూ అడిగింది.

'నీ దిక్కు తగిలాక ఇంక దేశయాత్ర ఏమిటి?'

## విచిత్ర దృశ్యాలు

కవిలో పొంగే ఉష్ణరక్తమే
'కవోష్ణ' రక్తం!
అంటే
వ్యాకరణం, పొందును
మరణం.

* * *

అద్దానికి యెదురుగా
అద్దం ఉంచితే
అనంతకోటి ప్రతిబింబాలు
అగుపిస్తాయని, భౌతికశాస్త్రం
అంటుంది. మరి
నీ కళ్ళల్లోకి నేనూ,
నా కళ్ళల్లోకి నువ్వూ
చూస్తే—
అనంతకోటి 'నువ్వూ నేను'లు
అగుపించవూ?

* * *

నవయౌవనవతి గాటపు
కవుగిలిలో చంటిపాపగాంచినచో మా
నవులకు మళ్ళీ యాశై
శవమును బడయంగ కాంక్ష
జన్మించు సుమా!

—కొడవంటి నరసింహం.

'ఏ ఏ ఊళ్లు వెళ్ళారు?'

'కలకత్తా, బొంబాయి, మద్రాసు, ఢిల్లీ, లండన్, గిండన్, అన్నీ చూశాను"

పిల్లలు మళ్లీ గొల్లుమని నవ్వారు.

'అబ్బ! సరిగా చెప్పండి'

'నిజంగా చెప్పనా'

"ఊఁ"

"భోంచేసిరే. అన్నీ చెబుతా! ఏయ్ పిల్లలూ మీరూనూ" అన్నాడు నరసింహం.

కంగారుగా అందరూ గబగబ భోజనం చెయ్యసాగారు. మాణిక్యం కూడా భర్త ప్రక్కనే వడ్డించుకుని భోజనానికి కూర్చుంది.

నరసింహం భోజనం పూర్తిచేసుకుని చేతులు కడుక్కున్నాడు. కాలంమార్పులు విచిత్రంగా తోచాయి నరసింహానికి. వారం రోజులక్రితం మౌంట్ అబు దగ్గర హోటల్లో

ఉన్నాడు. అసలు ఇంటికి తిరిగి రాకూడదనే నిశ్చయంలో బయలుదేరాడు. చేతులో ముప్ఫయి రూపాయిలున్నాయి. జాగ్రత్తగా ఖర్చు పెడుతూ హిమాలయాలు చేరాలని సంకల్పం. విజయనగరంనుంచి తిన్నగా బొంబాయి చేరుకున్నాడు. సగంభాగం పైగా టిక్కట్టు లేకుండా ప్రయాణం చేశాడు. బొంబాయిలో ఒకటి రెండు రోజులు కాలినడకను ఊరంతా తిరిగాడు. పేవ్‌మెంట్లమీదే కండువా కప్పుకుని పడుకున్నాడు ఆకలివేసినప్పుడు రెండుమూడు అణాలు ఖర్చుపెట్టి మొక్కజొన్న పొత్తులు దుంపలు కొనుక్కుని తినేవాడు చూడ్డానికి అందంగా ఉన్న బొంబాయిలో తనలాంటి బికారివాడికి ఏమీ సౌఖ్యంఉన్నట్లు కనిపించలేదు. అది ధనవంతుల పట్నం అనున్నాడు సెంట్రల్ స్టేషనుకు ఒకరోజు ప్రొద్దున్న వెళ్ళేటప్పటికి ఏదో రైలు కనిపించింది ఒక ప్లాటుఫారం టిక్కట్టు కొనుక్కుని రైలు ఎక్కేశాడు. అది ఎక్కడికి వెడుతుందో కూడా తెలియదు. రైలు బరోడా, అహమ్మదాబాదు, దాటిపోయింది. ఎత్తైన మౌంట్ అబు చాలా అందంగా ఉంటుందని ఎవరో అనుకున్నారు. చూడాలనిపించింది నరసింహానికి. రైలు దిగాడు రాత్రి మామూలు బాటసారిలా స్టేషనులోనే ఒకమూల ఒరిగి పడుకున్నాడు. తర్వాత నాలుగైదు రోజులు మౌంట్ అబు చూశాడు. జ్వరం వచ్చింది. చేతిలో ఐదురూపాయిలు ఉంటే రైలు స్టేషనువద్దఉన్న హోటల్లో బస చేశాడు. డబ్బు పూర్తిగా అయిపోయింది. నరసింహానికి తటుక్కున ఆలోచన తట్టింది. అవధానికి ఒక కార్డువ్రాసి పడేశాడు అడ్రసుయిచ్చి ఒక వందరూపాయిలు తక్షణం పంపమని. అవధాని తప్పక పంపిస్తాడని నరసింహం ఆశ. ఆ డబ్బుతో మెల్లిగా హిమాలయాలు చేరి సన్యాసిలా బ్రతుకుదామని అతని సంకల్పం. కాని తన ఆలోచనలకు వ్యతిరేకంగా రామమూర్తి తన హోటలు వెతుక్కుంటూ తయారయ్యాడు. మొదట చాలా కంగారుపడ్డాడు నరసింహం. రామమూర్తికి కనిపించకుండా తక్షణం ఎక్కడైనా దాక్కుందామని ప్రయత్నించాడు. కానీ రామమూర్తి చూడనేచూశాడు తన్ను.

నరసింహం హాస్యంగా మాట్లాడాడు. ఎత్తులు వేశాడు పై ఎత్తులు మార్చాడు. రానని కోపంతో అరిచాడు. రామమూర్తిని తిట్టాడు ఎందుకు వచ్చావని. రామమూర్తి లొంగలేదు. అతను మాణిక్యం,పిల్లలు సంగతి బాధాత్మకంగా చిత్రించి విపులంగా చెప్పాడు పిల్లలస్మరణరాగానే నరసింహానికి కడుపు చెరువైపోయింది దుఃఖంతో మాణిక్యాన్ని, ముఖ్యంగా పిల్లల్ని తక్షణం చూడాలనే కోరిక కలిగింది. తను లేచిపోవడం మూర్ఖత్వంలా తోచింది. తిరిగి ఇంటికిరావడానికి ఒప్పుకున్నాడు. అంతే రోజులు చక్రంలా తిరిగిపోయాయి. కోటిపల్లిలో ఉన్నాడు ఇప్పుడు.

నరసింహం తన పరిస్థితులు జ్ఞప్తికి తెచ్చుకుని ఒక్కసారి నవ్వుకున్నాడు. భుక్తాయాసం తీర్చుకుందామని వాలుకుర్చీలో మేను వాల్చాడు.

ప్రకాశం, సాంబు, సీత, ప్రక్కనే ఉన్న మంచంమీద కూర్చున్నారు తండ్రి చెప్పేవింతలు విందామని.

మాణిక్యం వంటిల్లు శుభ్రంచేసుకున్న తడి చేతులు కొంగుతో తుడుచుకుంటూ, తమలపాకులసజ్జ తెచ్చుకుని కూర్చుంది.

"ఊఁ చెప్పండి" అని తమలపాకులకు సున్నం రాయసాగింది మాణిక్యం.

నరసింహం కథ ప్రారంభించాడు.

"అసలు తిన్నగా హిమాలయాలకుపోవాలని బయలుదేరాను. రాజమండ్రి వెళ్ళాక అవధానిని ఒకసారిచూడాలని బుద్ధి పుట్టింది. విజయనగరంలో అవధానితో రెండురోజులు ఖులాసాగా సినీమాలుచూస్తూ గడిపేశాను."

"ఏమండీ! మా అన్నయ్యతో యిలా లేచిపోతున్నానని చెప్పలేదటండీ!" అంది వెటకారంగా మాణిక్యం.

"చెబితే మీ అన్నయ్య కదలనిస్తాడా అక్కడినుంచి అందుచేత అతనితో చెప్పకుండా ఒకరోజు ప్రొద్దున్నే కూడా వడిగాలేచి అవధానిని స్టేషనుకు రాకుండా చేసి, ఒంటరిగా రైలుఎక్కేశాను. తిన్నగా బొంబాయి వెళ్ళాను

ఏం కార్లు! ఏం జనం! ఏం ట్రాములు! నిజంగా ఆశ్చర్యపోయాను. మద్రాసును మించినంత అందంగా ఉంది. నడిచి ఊరంతా తిరిగాను. ఎంత తిరిగినా అంతం కనిపించటంలేదు. మెరీనా, చౌపతి, జుహూ

అందులో రాళ్లూ రప్పలూ ఉంటా యన్నారు మా మేస్టారు!" అంది శాంత.

ఊరుకో! చెప్పింది విను! మౌంట్ అబు కొండ చాలా అందంగా ఉంటుంది. దాన్ని చూద్దామని ఎంతోమంది దొరలు కూడా వస్తూంటారుట! అక్కడ పెద్ద జైనదేవాలయాలున్నాయి. చాలా ఖర్చుపెట్టి అందంగా కట్టారు వాటిని!

"నాన్నా! మనవూళ్లో శివాలయంకంటె బాగుంటాయా?" సాంబు మధ్యలో అపాడు తండ్రిని.

"ఆఁ చాలా అందంగా ఉంటాయి. అసలు కొండ ఎక్కాలంటే కారుమీద వెళ్లాలి ఇంచుమించుగా పదిహేను మైళ్ళు ప్రయాణంచేయాలి పాములాగ కొండమీద బాట మెలికలు చుట్టుకుంది. కొండమీద కారు వెళుతూంటే ఆదారి ప్రక్కన క్రింద అంతా అగాధమైనలోయలు. అరణ్యాలు చాలా భయంకరంగా ఉంటాయి. కారు కాస్త అజాగ్రత్తగా నడిపిస్తే ఏ అగాధంలో పడ్డా మళ్లీ బ్రతుకుతామనే ఆశ ఉండదు పెద్దవరుసలో కొండల ప్రక్క కొండలు నిలుచుని ఉన్నాయి మధ్యమధ్య వాగులు కొండలమధ్య ప్రవహిస్తున్నాయి కారు వెళుతుంటే దారిపొడుగునా పెద్ద పెద్ద చెట్లు నెత్తిమీద అల్లుకుని ఎండదెబ్బ తగలనీయవు. ఎక్కుతూంటేనే కొండ చాలా అందంగాఉంది. పిల్లలంతా నోరావలిస్తూ కూర్చున్నారు తిన్నగా నడిచి జైనదేవాలయంలోకి వెళ్లాను తీర్థంకరుల విగ్రహాలతో కొండపైనిఉ ద్వాదశ నాలమధ్య ఆఆలయాలు ఎంతో అందంగా ఉన్నాయి ప్రతీ స్తంభం, ప్రతీ అంగుళం, చలువరాయి కనిపించింది ఆ దేవాలయంలో. ఆ చలువరాయిలో చెక్కబడిన శిల్పం అపురూప సౌందర్యంగా ఉంది ఒక్కొక్కనగిషీ యీ కాలం మనమెక్కడా చూడం అందులో పదివందలసంవత్సరాల క్రితం కట్టబడినదేవాలయాలు ఈనాటివరకు ఇంత అందంగా నిలబడిఉన్నాయంటే, ఆనాటి కళానైపుణ్యం ఎంత ఉత్తమమైనదో ఆలోచించాలి. దేవాలయాలు లోపల చల్లగా మంచుగడ్డలా వున్నాయి. నేను కూడా ఒక జైనసన్యాసినైపోయి అక్కడే ఉండిపోదామనుకున్నాను. ప్రశాంత వాతావరణంలో నిష్కల్మషమైన హృదయంతో దైవధ్యానం చేసుకుంటూ, ప్రకృతి సౌందర్యాలు తనివితీర గోలగలిగితే మనిషికి ఇంక కావలసిందేముంది? తన్మయత్వంతో కళ్లు మూశాడు నరసింహం మాణిక్యం ఋగ్గు చేతులుఅన్ని తనేకధ్యానంతో నరసింహాన్ని చూసింది.

తర్వాత ఆలయాలుదాటి క్రిందకు వచ్చాను అక్కడే ఒక! ఒక అయ్యరుగారు హోటలు పెట్టి కూర్చున్నాడు. స్వర్గానికెళ్లినా సవతిపోరు తప్పదన్నట్లు ఈ జైనుల కొండమీద కూడా నువ్వు వెలిసావా మహానుభావా!' అని ఆశ్చర్యపోయాను. అయినా అయ్యరు చేసే ఇడ్డీ సాంబారు జ్ఞాపకం వచ్చింది, ఒక ప్లేటు తెప్పించి, తిని, నీళ్లు తాగి కడుపు నింపుకున్నాను తర్వాత నక్కి లేక్ (*Nakki Lake*) అని ఒక అందమైన చిరు సోకటి చూశాను. అందులో పడవ ఎక్కి కాస్సేపు తిరిగాను. ఆ కొండమీద సూర్యాస్తమయం నిజంగా చూడవలసిన దృశ్యం. అక్కడ పెద్ద పెద్దవాళ్ళ వచ్చే క్లబ్బులు, భవనాలు, అన్నీ చూశాను.

చేతులో పైసలు అయిపోవచ్చాయి. ఆ రాత్రి ఒక చెట్టుకింద పడుకున్నాను బస్సు స్టాండువద్ద. మర్నాడు మెల్లిగా కాళ్లీడ్చుకుంటూ కొండంతా ఒంటరిగా నడిచి, క్రిందకు దిగి, ఒక హోటల్లో బసచేశాను. డబ్బుకోసం అవధానికి ఉత్తరం వ్రాశాను రామమూర్తి వచ్చి నన్ను బలవంతాన ఇక్కడ వదిలేశాడు 'శ్రీమతి మాణిక్యమ్మ ఇంటిలో' అంటూ భార్యవైపు నవ్వుతూ చూశాడు నరసింహం.

'బాగుంది. మీ కథ' అంటూ మూతి విరుచుకుంది మాణిక్యం

'మరి నీ కథో!' అన్నాడు వెటకారంగా.

'చాల్లెండి. ఇంక పడుకోరా ఏమిటి?' అంటూ ప్రక్కలు వెయ్యాలని లేచింది మాణిక్యం శాంత అప్పుడే పడుకుని నిద్రపోయింది

అందరికీ మంచాలు వేసి ప్రక్కలు సర్ది శాంతను మంచంమీద పడుకోబెట్టింది. ప్రకాశం, సాంబు, ఒకమంచంమీద చేరారు నిద్రపోడానికి.

మంచంమీద చెరోకవైపు ఒరిగారు ఇద్దరూ తండ్రి చెప్పినవిషయాలు తలలో తిరిగాయి ప్రకాశానికి. దేవాలయం, పెద్ద కొండలు, అరణ్యాలు, లోయలు, చెరువులు, నిర్మలమైన వాతావరణం అన్నీ కళ్ళకు కట్టాయి. కాశినాడలో సత్యనారాయణవ్రతాలో పుస్తకాలు తప్పిస్తే అంతా ప్రశాంతంగా ఉంటుంది అసలు దేవాలయాలలో అడుగు పెడితేనే ఏమిటో దేవుణ్ని ప్రతినిత్యం కొలవాలని బుద్ధి పుడుతుంది ప్రపంచం ఎంతో ఉంది అనేక మహాసముద్రాలున్నాయి కొండలు - రాళ్లు - గుట్టలు - నదులు - అనంతమైన ప్రజలు - వాళ్ళజీవితాలు - ఆకాశం - నక్షత్రాలు - సూర్యుడు - చంద్రుడు - వానలు - మబ్బులు పగళ్లు ఏమిటో అన్నీ చాలా వింతగా కనిపించాయి ప్రకాశానికి ప్రతీవస్తువు దాని కాల పేగో విచిత్రమైన దివ్యాంశక్తి ఉందనిపించింది. తను కూడా ఎప్పుడైనా హిమాలయాలకు నిజంగావెళ్ళి సన్యాసిలా తపస్సు చేస్తుంటే బాగుంటుందేమో. మనుష్యులు బ్రతకడం - బాధ పడటం - అన్నీ దైవలీలలుగా కనిపించాయి. ఏవో ఆలోచిస్తూ, వైరాగ్యం, భక్తితో హృదయం నిండి, దైవాన్ని ధ్యానించుకుంటూ నిద్రపోయాడు ప్రకాశం.

సాంబుకు కూడా తండ్రి వర్ణించిన బొంబాయి పట్నం, పెద్దభవనాలు, కార్లు, ట్రాములు, రైళ్లు, అన్నీ తలలో మెదిలాయి తనుకూడా పెద్దవాడయ్యాక ఒక మంచి కారు కొని సూటు వేసుకుని కాళ్ళ నాడలో బ్రరుమని డ్రైవ్ చేసుకుంటూ పోవాలి. తళుక్కుమనే సిల్కుబట్టలు, విద్యుద్దీపాలు, అలంకరించుకున్న ఆడవాళ్లు ఎందరో పట్నాలలో ఉన్నట్టు అతని మనస్సులో కదిలారు వీళ్లంతా చాలా అందంగా ఉంటారు కాబోలు! ఆ ఊళ్లోని వీరయ్యనాయుడు పెళ్లాం రంగమ్మనూ చూశాడు చాలా చదువుకుందిట! ఎప్పుడూ సిల్కుచీర, మడమలకు ఎత్తుజోడు, కళ్ళజోడు లేనిదే బైటికిరాదు తన క్లాసులో పువ్వవల్లి ఉంది బ్యాంకి సెక్రటరీగారి అమ్మాయి - ఎప్పుడూ సిల్కు పరికిణీ, సిల్కు జాకెట్టు, స్లిప్పరు తొడుక్కుని ఠీవిగా నడుస్తుంది వీళ్లంతా యీ పెద్దపెద్ద పట్నాలు చూశారులాగుంది!! తను పెద్దవాడైయాక ఒక పెద్ద మేడ కట్టి గర్వంగా ఒక కారు కొని, హాయిగా బ్రతకాలి అనుకుంటూ నిద్రపోయాడు సాంబు

తనకు నిర్ణయించినమంచంపై కాళ్లు సాచుకుని పడుకున్నాడు నరసింహం. మాణిక్యంఇంట్లో దీపం తగించింది మంచి నీళ్ళచెంబు తెచ్చి నరసింహం మంచం ప్రక్కన పెట్టింది

'పిల్లలు పడుకున్నారా?' నరసింహం మాణిక్యంవైపు చూశాడు.

'ఆఁ' అని నవ్వింది ...

'కూర్చో కాస్సేపు'

మాణిక్యం మంచంప్రక్కనే కూర్చుంది.

'ఎంత బెంగపెట్టుకున్నావనుకున్నారు మీకోసం'

'అలాగా?'

'ఈ పిల్లలసంగతి ఏమౌతుందో అని పరిపరివిధాల బాధపడ్డాను!!'

'పాపం!'

# ★ ఉదయకిరణాలు ★

'మళ్ళీ వస్తారనిమాత్రం ఆశలేకపోయింది ఎందువల్లో! కాని నా అదృష్టం బాగుంది!

'పిచ్చిదానా నిన్ను విడిచి ఉండగలనా?" అంటూ నరసింహం మాణిక్యం బుగ్గలు చిదిమాడు. మాణిక్యం తలుపు చేర్ల వేసింది

రెండుమూడుదినాలు నరసింహం బైటికి రాలేకపోయాడు. ఇట్లోనే పిల్లలతో మాణిక్యంతో కాలం గడపసాగాడు.

నరసింహం తిరిగివచ్చినవార్త ఊరంతా వ్యాపించింది. ఎరుగున్న స్నేహితులు, బంధువులు, ఇరుగు పొరుగువారు నరసింహాన్ని పరామర్శ చెయ్యడానికి వచ్చారు. అందరికీ సమాధానాలు చెప్పలేక తలప్రాణం తోకకువచ్చేది నరసింహానికి. అప్పులవాళ్లు ధైర్యంగా తమ డబ్బు రాబట్టుకోవచ్చని నరసింహం ఇల్లు చుట్టవేశారు. త్వరలో తీర్చేస్తానని ప్రతీవాడికీ వాగ్దానం చేశాడు. ముఖంచెల్లక ఊళ్లోకి మాత్రం వెళ్ళలేకపోయాడు అతను.

రాధమ్మ తన యింటికి నరసింహం రాలేదని బాధపడింది. చేసినపనికి ముఖంచెల్లక బంధువులని చూడలేకపోయాడేమో అని సర్దుకుంది రాధమ్మ. 'మనమేమనా చుట్టాలం కనుకనా! మన యింటికి ఎందుకు వస్తాడే!! అనవసరంగా పూసుకుని మనమే వాళ్ళ చుట్టూ తిరుగుతాము కాని, మన యింటికి వాళ్లు రావలసిన అగత్యం ఏముంది' సాగదీసుకుంటూ చెప్పింది సీతమ్మ 'దాని గుణం ఎప్పుడూ అంతే' అనుకుని చిరాకుపడింది రాధమ్మ.

నరసింహాన్ని ఒకసారి చూడాలని కోరిక కలిగింది రాధమ్మకు. రెండురోజుల్లో చిట్టిబాబును తీసుకుని తిన్నగా కోటిపల్లి వచ్చేసింది

రాధమ్మ గుమ్మంలో కనిపించగానే నరసింహానికి ఆశ్చర్యం కలిగింది.

'ఏమమ్మోయి వదినా! యిలా అకస్మాత్తుగా దర్శనం యిచ్చావేమిటి?

'నువ్వు మా యింటికి రాకపోయినా, మేమైనా మీ యింటికివచ్చి తీరాలిగా!' అంటూ నవ్వుతూ ఇంట్లోకి వచ్చింది రాధమ్మ. అప్పగారిని చూసి మాణిక్యానికి చెప్పలేనంత సంతోషమొచ్చింది.

కాకినాడలో దిగి కూడా తన యింటికి రాలేదని రాధమ్మకు కోపంవచ్చి వుండచ్చని నరసింహం గ్రహించాడు. కాని ఆ పరిస్థితుల్లో బంధువుల ఇళ్ళకి వెళ్ళడం మనస్కరించలేదు అతనికి.

అప్పచెల్లెళ్లు ఏవేవో పుట్టుపూర్వోత్తరాలు, కబుర్లు చెప్పుకుంటూ రెండురోజులు ఆనందంగా గడిపేరు. ప్రకాశం చిట్టిబాబు, శాంత, సాంబు, యిల్లు పిండికొట్టేటంత అల్లరి చెయ్యసాగారు. నరసింహం ఇంట్లోనేవుండి పిల్లలతో బాటు తనుకూడా అల్లరిచెయ్యడం మొదలెట్టాడు.

'దేశయాత్రకు వెళ్లివచ్చాక అల్లరి మరీ ఎక్కువయిందే' రాధమ్మ మరిదిని వేళాకోళం చేసింది.

'మరే! అక్కడ అల్లరి బాగా నేర్చుకువచ్చాను' ఇద్దరూ నవ్వుకున్నారు.

'అవధాని కులాసాగా ఉన్నాడా'

'ఓ! దివ్యంగా బ్రతుకుతున్నాడు'

'ఇంక పెళ్ళి చేసుకోడా ఏమిటి?'

'మరే! పెళ్లి చేసుకున్న నాలాంటివాళ్లు సుఖపడుతున్నారు కనుకనా! దీని పోరుతోనే నేను లేచిపోవలసివచ్చింది' అంటూ నవ్వుతూ నరసింహం భార్యవైపు చూశాడు.

'ఆఁ అటువంటి మంచి పెళ్ళాం ఉంది కనుకనే నీ ఆటలు సాగుతున్నాయి. మరో కత్తె అయితే ఇంట్లో ఖంజాయింపు చేసి నిన్ను గడప దాటనివ్వదు'

'అల్లా మీ చెల్లెలు చేస్తోంది కనుకనే ఉద్యోగం కూడా మాని యింట్లో కూర్చోవలసి వచ్చింది'

మాణిక్యం, రాధమ్మ నవ్వుకున్నారు

బంట్రోతు సత్తెన్న ఒక ఉత్తరం తీసుకువచ్చాడు.

'రాఘవయ్యగారు మీకీ ఉత్తరం ఇమ్మన్నారు'

ఉత్తరం విప్పి, ఆత్రుతతో చదివాడు నరసింహం. ముఖంలో ఆనందరేఖలు తాండవంచేశాయి ఉత్తరం మళ్లీ మడతపెట్టి కవరులో పెట్టేశాడు.

'ఏమిటది?' రాధమ్మ చాలా కుతూహలంగా అడిగింది.

'రేపటినుంచి మళ్ళీ ఉద్యోగంలో చేరవచ్చని ఆర్డరు వచ్చింది' అన్నాడు నరసింహం

'హమ్మయ్య! ఇంక మీ ఆవిడను దెప్ప నవసరంలేదు' రాధమ్మ మళ్ళీ వేళాకోళం ప్రారంభించింది.

'ఈ ఆర్డరు రాడానికి ముఖ్యకారణం ఏమిటో తెలుసా?" నరసింహం ఏదో ముఖ్యవిషయం చెప్పబోయేటట్లు ముఖం పెట్టాడు.

'నేను ఊరు విడిచి లేచిపోవడంవల్ల ఈ ఉద్యోగం తిరిగి యిచ్చేశారు తక్షణం' నరసింహం మాటలు అర్థంకాక నోళ్లు ఆవలించారు అప్పచెల్లెళ్లు

'అదే! నేను లేచిపోవడంవల్ల, పిల్లల సహితంగా వచ్చి పోషించమని మాణిక్యం వచ్చి అల్లరి చేస్తుందేమోనని రాఘవయ్య భయపడి ఉంటాడు. అదృష్టవశాత్తు నేను తిరిగి ఇంటికి రావడంవల్ల, యీ పెద్ద మన కొంగుకని నాకు ఉద్యోగంలో జేరమని ఆర్డరు పంపించిఉంటాడు. నేనే ఒకవేళ లేచిపోకపోతే యీ ఉద్యోగంలో ఆరునెలలదాకా చేరడానికి వీల్లేకపోయేది" అంటూ విశదీకరించాడు నరసింహం

'అదంతా నీ ప్రయోజకత్వం ఏం కాదులే. మాణిక్యం అదృష్టం!' అంటూ చెల్లెలును పొగిడింది రాధమ్మ.

'అప్పగారు చెల్లెలుపక్షాన మాట్లాడకపోతే నాపక్షాన ఎందుకు మాట్లాడుతుంది?' అంటూ నరసింహం లేచాడు ఒకసారి రాఘవయ్యను చూసివద్దామనే ఉద్దేశ్యంతో.

'ఎక్కడికి?' ప్రశ్నించింది రాధమ్మ

'అడిగేవు! ఇంక పని సాగినట్లే' మళ్ళీ కూర్చున్నాడు నరసింహం హాస్యంగా!

'నా కెందుకు నీ గొడవ! పదవే మనం లోపలికి పోదాం' అంటూ రాధమ్మ మాణిక్యంతో గదిలోకి పోయింది

'సత్తెన్నా! ఇప్పుడే రాఘవయ్యగారింటికి వస్తున్నా. నువ్వు వెళ్లు!' అంటూ బంట్రోతును పంపించాడు నరసింహం.

ఆర్థిక చిక్కులతో బాధపడలేక నరసింహం లేచిపోయేడన్న వార్తవిని స్వతస్సిద్ధంగా మంచివాడైన రాఘవయ్యకు జాలి కలిగింది. అతని కుటుంబం ఆధారంలేక, ఏం బాధపడుతోందో అని నిజంగా విచారించాడు. ఒకవేళ నరసింహం ఈ ఆరునెలలలోగా యింటికివస్తే అతని ఉద్యోగం తిరిగి యిచ్చేద్దామని నిశ్చయించుకున్నాడు అతని పిల్లల ఉసురు తనకు తగులుతుందేమో అన్న భయంతో! నరసింహం ఇంటికి వచ్చేడని తెలిసి, ఉద్యోగంలో

తీరమని ఆర్డరు పంపించాడు రాఘవయ్య.

నరసింహం వచ్చి నమస్కరించాడు రాఘవయ్యకు. 'అజాగ్రత్తమాని, ఇప్పటికైనా చక్కగా పనిచేసుకో' అని మందలించాడు రాఘవయ్య. 'మీరు చూపిన దయకు కృతజ్ఞుణ్ణి' అంటూ నరసింహం సెలవుతీసుకు వచ్చేశాడు ఇంటికి.

రాధమ్మ పిల్లలను తీసుకుని కాకినాడ వెడతానంది. చిట్టిబాబుకు, ప్రకాశానికి, ఒక నెలరోజులే పరీక్షలున్నాయి. నరసింహం ఆగమని వదినగారిని బలవంత పెట్టలేకపోయాడు. ఆ సాయంత్రమే రాధమ్మ, కుర్రాళ్ళిద్దర్నీ వెంటబెట్టుకుని వెళ్ళిపోయింది కాకినాడకు

రాధమ్మ వెళ్ళిపోయాక, నరసింహం వీధిలో అరుగుమీద చల్లగాలికి వాలుకుర్చీ వేసుకుని కూర్చున్నాడు. మాణిక్యం ఇంట్లో వంటప్రయత్నం చెయ్యసాగింది.

జరిగిన సంగతులన్నీ జ్ఞప్తికి వచ్చాయి. ఆస్తి అంతా పోయింది. పెరుగుతున్న కుర్రాళ్ళ చదువులు ఏమీ పూర్తి కాలేదు. శాంతకు పెళ్ళి చెయ్యాలి. వచ్చే నలభై రూపాయిల జీతం కుటుంబ ఖర్చుకు సరిపోతుంది. ముందుగతి ఎలాగో?

అవధాని అంత మంచివాడు బావమరిదిగా దొరకడం అదృష్టం. అతని సహాయం లేకపోతే ఏమయ్యేదో! చిన్నప్పుడు చాలా కష్టపడినా ఇప్పుడు దోసిళ్లతో బాగా తెచ్చుకుంటున్నాడు. అదృష్టమే ఉంటే, తను ఉన్నా లేకపోయినా పిల్లలు తప్పక బాగుపడతారు, అతనిలాగే!

ఇంక పేకాట, త్రాగుడు జోలికి వచ్చినా పోకూడదు. క్లుప్తంగా కుటుంబాన్ని పోషించుకుంటూ, మిగిలిన సొమ్ము దాచి పిల్లలకు బాగా చదువులు చెప్పిస్తే ఆస్తి లేకపోయినా చదువులవల్లైనా వాళ్లు బాగుపడతారు.

సర్వ వ్యసనాలు పరిత్యజించి, ఆదర్శ గృహస్థులా, ఉన్నదానితోనే సంతృప్తి పడి, జీవితం యికముందు ప్రశాంతంగా గడుపుకోవాలని తీర్మానం చేసుకున్నాడు నరసింహం.

## 6

ఏడాది గడిచింది. కాలప్రవాహంలో ఆ కుటుంబంలోని జీవితనౌకలన్నీ ఒడుదుడుకులు లేకుండా సాఫీగా ప్రయాణం చేశాయి.

ఒక్క అవధానిమాత్రం, ఏదో వెలుగు పోయి, అంధకారం తన్ను చుట్టుముట్టిందని బాధపడుతున్నాడు. చనిపోయిన భార్యతో గడపిన మూడు సంవత్సరాల సంసార జీవితం అతనిలో ప్రతీనిత్యం మెదలుతోంది. చిలకా గోరింకల్లా ఏకష్టం లేకుండా, సంపాదించుకుంటున్న జీతంతో, ఎంతో ఆనందంగా కాలం గడిపేరు భార్యా తనూ. ఆఫీసులో పనిచేసిన హైరానుతో ఒళ్లు హూనమయి యింటికి రాగానే, భార్య, స్నానానికి వేడినీళ్లు, తిండానికి ఫలహారం సిద్ధచేసి వుంచేది. సాయంత్రం ఒక గంట షికారుకుపోయి ఇంటికివచ్చి వేడిభోజనం తాంబూలం సేవించగానే, స్వర్గంలో తేలుతున్నట్లు సుఖనిద్ర వచ్చేది. భార్య ఉపచారాలు, ఆమెతో గడపిన సరదా జీవితం, ఆమె నవ్వుల్లో చూపుల్లో తను అనుభవించిన ఆనందం, సంతృప్తి, అవధానిని వెన్నంటి వేధిస్తున్నాయి.

ఒక్కొక్కరోజు బంట్రోతురాడు. వంట తను చేసుకోవలసివస్తుంది. వేడిగంజి చేతిమీదపడి బొబ్బలు లేచాయి. కూర తరుక్కుంటూంటే చెయ్యి కోసుకుపోయింది. వేడివేడి కుంపటి చేతులు కాల్చింది. పరధ్యానంలో ఉండగా పప్పు మాడిపోయింది. ఉడికీ ఉడకని మెతుకులు, మాడిపోయిన పప్పుతో భోంచేసి లేచినరోజులు అవధాని జీవితంలో చాలా వున్నాయి.

ఒంటరిగా యిలా ఎంతకాలం బ్రతకడం? ఎడారిలో మాడిన మోడులా కమిలి ఎండిపోతోంది తన జీవితం. ఆఫీసునుంచి రాగానే భూతాల యిల్లులా బేజారుమంటూ ఉంటుంది బంగళా. గృహిణిలేని యిల్లు వెలుగులేని బ్రతుకులా తోచింది అవధానికి. గతించిన భార్యను మరచిపోలేక పోతున్నా తన కొక భార్య అత్యవసరమనే విషయం మాత్రం రూఢి ఔతోంది. ఏదో విధంగా పెండ్లి చేసుకుని తిరిగి సంసార జీవితం గడపాలని నిశ్చయించుకున్నాడు అవధాని.

ఒకరోజు సాయంత్రం షికారుకు బయలుదేరాలని దుస్తులు వేసుకుంటున్నాడు అవధాని. బంగళా ఎదురుగా జట్కా ఆగింది. రామమూర్తి, అతని భార్య, చిన్న ఆడపిల్ల ప్రక్కనే పద్దెనిమిదేండ్ల ఒక అందమైన అమ్మాయి, బండిలోంచి దిగారు. ఆ అందమైన అమ్మాయివైపు ఒక్కసారి తేరిపార చూశాడు అవధాని. మునుపు ఎక్కడా చూసి ఉండలేదు. రామమూర్తికి బంధువౌతుందో? అనుకుంటూ, రామమూర్తిని ఆహ్వానించాడు.

అవధాని రామమూర్తి భార్యను ఎరుగును. అతని కూతుర్ని మొదటిసారి చూడడం. రామమూర్తి తన కూతురుగురించి ముచ్చట్లు అప్పుడప్పుడు చెబుతూంటే విన్నాడు. ఇంక పరిచయం కావలసిన మనిషి, ఆ అందమైన అమ్మాయే.

రామమూర్తి అవధాని ఊహ గ్రహించాడు.

'ఈ అమ్మాయి మా మరదలు. ఇంటరు పరీక్షకు వెడుతోంది. నిన్ను ఒకసారి చూడాలని మా ఆవిడ పట్టుబడితే ఇలా దిగాం' అన్నాడు రామమూర్తి.

'సంతోషం. అభిమానం ఉంది కనుకనే ఇలా వచ్చారు' అన్నాడు అవధాని.

రామమూర్తి భార్యతో అవధానికి చనువుంది. అతను భార్యతో విజయనగరంలోనే



**గోదావరి వంతెనమీద రైలు**

—ఫోటో: పి. రామారావు,

ఉంటూండగా ఒకటి రెండుసార్లు రామమూర్తీ అతని భార్య వచ్చి నాల్గురోజులు గడిపి వెళ్లిపోయినారు.

రామమూర్తి భార్య సత్యవతి విజయనగరంలో దిగాలని సంకల్పించుకోడానికి ఒక కారణం ఉంది తన చెల్లెలు లీలను అవధానికి యిచ్చి పెండిచేస్తే బాగుంటుందేమో అనుకుంది రెండో పెళ్ళి అయినా, ఇరవైఎనిమిది ఏండ్లు దాటని యువకుడు, బాగా సంపాదించుకుంటున్నాడు. తన కుటుంబానికి సన్నిహితుడు, మంచివాడు, తన చెల్లెలు సుఖపడుతుందని ఆశపడింది సత్యవతి అవధాని పెళ్లిచేసుకోనంటున్నాడని విన్న సత్యవతి ఈ అభిప్రాయం భర్త దగ్గర కూడా తేల్పక, అసలు పరిస్థితులు తెలుసుకుందామనే యిక్కడ దిగింది.

నాల్గురోజులమధ్యా అనేక సంగతులు దొర్లిపోయాయి సంభాషణలో. మామగారు అనకాపల్లిలో కొత్తయిలు కట్టి గృహప్రవేశానికి రమ్మని వ్రాస్తే బయలుదేరినట్లు రామమూర్తి చెప్పాడు

'ఏమండీ! మీరు యింక పెళ్ళిచేసుకోరా! యింకా ఎంతకాలం ఒంటరిగా జీవిస్తారు' సత్యవతి సంభాషణ కదిపింది.

ఆమెదగ్గరనుంచి యీ ప్రశ్న వస్తుందని రామమూర్తి కాని, అవధాని కాని ఊహించలేదు కొంచెం కంగారుపడ్డాడు అవధాని, సమాధానం వెతుక్కుంటూ.

'ఏదో గడిచిపోతోందిలెండి' అన్నాడు అవధాని చిరునవ్వుతో.

'మాకేమీ బాగాలేదు మీవరస' అంటూ మందలించింది సత్యవతి. చనువువల్ల అలా అంటూందని, భర్త కాని, అవధాని కాని ఆమెను అపార్థం చేసుకోలేదు.

'ఈ ఏడు పెండ్లి చేసుకుందామనుకుంటున్నా' అన్నాడు అవధాని, యీవిడ చెవిలో ఒక ముక్క పడేస్తే, ఎరుగున్న సంబంధాలు ఏమున్నా తనదగ్గరకు రావచ్చునని.

ఈ మాట విని రామమూర్తి ఆశ్చర్యపోయాడు

'ఇదేమిటి ఇలామారిపోయేవు! మొన్నటిదాకా పెళ్లి వద్దని, ఇప్పుడు పెళ్లాం కావాలంటున్నావేమిటోయి!'

రామమూర్తి పరిహాసకమాడాడు.

'ఎల్లకాలం ఒకలాగే ఉంటారా ఏమిటి?' సత్యవతి, అవధానిని సమర్థించింది ఆవిడకు లోలోపల ఆనందం పట్టతరం కావటంలేదు.

ఆరోజు రాత్రే సత్యవతి రామమూర్తితో గుసగుసలాడింది, లీలను పెళ్లిచేసుకోమని అవధానికి చెప్పమంటూ భార్య అభిప్రాయం సమంజసంగా తోచింది అతనికి. అవధాని ఊఁ అంటే తండ్రిని ఒప్పించి పెళ్లి నిశ్చయం చేస్తానంది సత్యవతి మామగారు కూడా సంబంధాలు వెతకాలిగా!

మంచి సంబంధం తనే కుదిరిస్తే సంతోషిస్తాడు! అనుకున్నాడు రామమూర్తి.

లీలను అవధానికిచ్చి పెండ్లిచేయాలనే ఉద్దేశ్యం కల్గిన సత్యవతి, ఆమెను అవధానికి చాలాసార్లు కనిపించేలా అనేక పనులు పురమాయించేది. భోంచేసేటప్పుడు మంచి నీళ్లు అందివ్వడానికి, తర్వాత తాంబూలాలు తయారుచెయ్యడానికి, ప్రక్కలు సర్దడానికి లీలను నియోగించింది. ఇంట్లో మరొక ఆడదిక్కు లేకపోవడంవల్ల, పనులన్నీ సత్యవతి, లీల, సర్దుకున్నారు.

తెల్లటిచీర కట్టుకుని, చామంతులు తల్లో ముడుచుకుని, చామనచాయ శరీరంతో, ఓయ్యారంగా అటూ యిటూ నడుస్తూ కనిపిస్తున్న లీల అవధానిని ఆకర్షించిన మాట వాస్తవం. అందులో భార్య కావాలనే కోరికతో ఉన్న అవధానికి, లీల తన భార్య కాగలిగితే బాగుంటుందనే ఆలోచన కూడా తట్టింది.

'ఏమన్నా సంబంధాలు చూశావా' అన్నాడు రామమూర్తి మర్నాడు ఫలహారాలు చేస్తూ.

'చూడా లనుకుంటున్నా'

'మా లీలను పెళ్లి చేసుకోరాదూ' ఆత్రంగా సమాధానంకోసం అవధానివైపు చూశాడు రామమూర్తి.

స్నేహితుడు తన్ను వేళాకోళం చేస్తున్నాడనుకున్నాడు అవధాని.

'ఇటువంటి విషయాల్లో హాస్యమాడకూడదోయి' చిరునవ్వు నవ్వాడు అవధాని.

'నేను నిజంగానే అడుగుతున్నాను.' రామమూర్తి పెళ్ళిపెద్దలా అన్నాడు.

'నాకేమీ అభ్యంతరం లేదు'

'అయితే పెళ్ళి కుదిర్చెయ్యనా?'

'నీ యిష్టం'

'వేళాకోళం కాదుసుమీ'

'తెలుసు'

రామమూర్తి గబగబ లోపలఉన్న భార్యదగ్గరకు వెళ్ళాడు. ఇదంతా వింటున్న లీలకు సిగ్గు పుట్టుకువచ్చింది. మరొక గదిలోకి పారిపోయింది.

పెద్ద బంగళా, నౌకర్లు వుండి రెండు వందల రూపాయల జీతగాడు భర్త కావడం లీలకు ఇష్టమే. అవధాని స్ఫురద్రూపి, అందంగావుంటాడు. అందువల్ల లీలకు ఏమీ అభ్యంతరం వున్నట్లు కనిపించలేదు.

సత్యవతి, రామమూర్తి పిల్లలను తీసుకుని ఆ సాయంత్రమే వెళ్లిపోతానన్నారు. అవధాని వాళ్ళని రైలు ఎక్కించి ఇంటికి వచ్చాడు.

తనవైపు పెళ్లిపెద్దలు ఎవరూలేక పెళ్ళి ప్రయత్నాలు సరిగా నడవటం లేదనిపించింది అవధానికి. ఆప్తమిత్రుడైన రామమూర్తితో బంధుత్వం కలుపుకోడం తనకు చాలా శ్రేయస్కరమనిపించింది. నరసింహానికి ఒక ఉత్తరం వ్రాస్తే అతనికి యిట్టియీ పెళ్లి స్థిరపరచగలిగే తెలివి, చలాకీ వున్నాయని అవధాని విశ్వాసం. తక్షణం ఒక ఉత్తరంవ్రాసి పోస్టులో వెయ్యాలని బైటకు నడిచాడు.

నరసింహానికి ఉత్తరం తపాలాపెట్టెలో జారింది. పెళ్లి అయ్యేకాలానికి పరిస్థితులన్నీ అలా కూడివస్తాయి. కళ్యాణతార రావాలే గాని, వస్తే, ఎన్ని ఆటంకాలు వచ్చినా పెండ్లి జరిగిపోతుందని అతని విశ్వాసం. లీలను భార్యగా ఊహించుకుంటూ, తను చెయ్యబోయే చమత్కార సంభాషణలు, నూతన గృహం, భార్య ఆదరణ, పుట్టబోయే పిల్లలు, వాళ్ల చదువులు, —ఎన్నో విషయాలుగురించి స్వప్నాలు అల్లుకుంటూ, ఈలలు వేస్తూ ఏవేవో ఊహించుకుంటూ, హుషారుగా ఇంట్లో అడుగుపెట్టాడు అవధాని.

ఇంటికి రాగానే టేబిలుమీద టెలిగ్రాం పడిఉంది. ఆఫీసు విషయాలుగురించి అర్థంపర్థం లేకుండా అర్ధరాత్రి కూడా అతనికి టెలిగ్రాంలు వస్తూనే ఉంటాయి. ఇది క్రొత్త కాదు. మామూలు ధోరణిలో టెలిగ్రాం కవరు చింపాడు.

టెలిగ్రాం చదవగానే అవధాని ముఖం మాడిపోయింది. నెత్తురుచుక్క లేదు వదనంలో. చేతులో టెలిగ్రాం జారిపోయింది. ఒళ్లు చెమటలు కమ్మి, విచారంగా వాలుకుర్చీలో కూలబడిపోయాడు. ఒక నెల రోజులు సెలవు కావాలని మద్రాసులో ఉన్న పెద్దఆఫీసరు తక్షణం ఒక టెలిగ్రాం పంపించాడు. మర్నాడు కోటిపల్లి వెళ్లడానికి సన్నాహాలన్నీ చేసుకున్నాడు. బెంగతో, బాధతో, రాత్రి నిద్రలేక తెలవారేటప్పటికి అవధాని సగమై, లోతుకుపోయిన కళ్ళతో నిట్టూర్పులతో రైలుస్టేషనువైపు నడిచాడు.

[ఇంకా వుంది]

ఒక ఆసామీ తన యింట్లోకి వచ్చి గడ్డితినేసిపోతున్న ఆవును కొట్టి తరిమేశాడు.

"తెగబడి పాలు తాగుతారు కాని గొడ్లకి మేత మేపలేరు. ఊళ్లో వాళ్ళ యిళ్లమీదికి తోలుతారు." అని విసుక్కున్నాడు.

ఇంతలో పాలేరు ఇంటికి వచ్చి ఫిర్యాదుచేశాడు.

"బాబయ్యా! మన తెల్లావు ఈ సందు చివరియింటో పడి తవుడు తిన్నదని తెగబాదాడు. నోరులేనిజీవం అని ఆ మాత్రం చూడక్కర్లేదుటండీ"

కమలా రామమోహనరావు,
కాకినాడ.

# మూకసౌందర్యం

## కా. సోమేశ్వరరావు

“అచ్చం ఇంటల్లుడిలాగా తిరుగుతున్నాడండీ ముచ్చటగానూ ఆ కూడు ముద్దూ పడితే మేమూ కళ్ళారా చూస్తాం” అంటూ వంటచేసే గంగా భాగీరథి బహు సంబరపడ్డది

సూర్యనారాయణకి కోపం బుసబుసమని పొంగుకొచ్చి కనుబొమలమధ్య పాములా మెలికలు తిరిగింది.

అత్తగారు వూరుకోకుండా – “పుట్టినప్పుడే వాళ్ళిద్దరికీ దేవుడు రాసి పెట్టాడు కోటమ్మా” అంది

వల్లో చిక్కుకున్న చేపలా విలవిలలాడి పోయాడు. వాళ్ళ నేమనాలో తెలీటం లేదు వాళ్ళమాటలు వింటుంటే ఒళ్ళంతా మండిపోతున్నది తన అసమర్థత సూతిగా తీసికొని వేళాకోళం చేస్తున్నట్టుగా తోచిందతనికి నిజంగా ఏడుపొచ్చింది ఉడుకుమోత్తనం వేసింది ఉక్రోషం వచ్చింది. చిరాకూ, విసుగూ, నిర్లక్ష్యం, ఏవగింపూ, కంటగింపూ ఇంకా ఎన్నో ఆ క్షణంలో అతగాడి హృదయంలో ఆతిథ్యాన్ని స్వీకరించాయి.

ప్రపంచంలోని సర్వశక్తులూ ఏకమై ‘సూర్యనారాయణ భార్య సీత’ అని సిద్ధాంతీకరించినట్టుగా తోచింది

కాలేజీకి వెడుతూ తప్పనిసరిగా అత్తవారింటో దిగవలసి వచ్చింది లేకపోతే మూతి విరింపులూ మాట పట్టింపులూ, మట్టిగడ్డలూ వచ్చి చల్లటి సంసారాల్లో అగ్ని రగుల్కొంటుంది.

కాబోయే తన సహధర్మచారిణివైపు చూశాడు. ఎంత ఏవగింపున్నా, హృదయంలో ఓమూల జాలి వేసింది తినిందాక భోజనంచేసి పారేసిన ఎంగిలి విస్తరాకు ఎత్తి పారేస్తున్నది అసహ్యించుకోకుండా మనసుకు చాలా కష్టమనిపించింది తన కష్టసుఖాల్లో పాలుపంచుకుంటూ తనకోసం ఒక స్త్రీ సర్వార్పణ చేస్తుందనుకొనేసరికి అతనిలో ఎన్నో మధురభావాలు ముద్దకట్టాయి అట్టి త్యాగమయీ, రాగమయీ దొరికితే తన కింకేమి కావాలి? వివాహం నాడు మోగే మంగళప్రదమైన వాద్యాల ఘోష చెవుల్లో – కాదు – మనసులో ధ్వనించింది ఆ క్షణ మెప్పుడొస్తుందో.

ఆ స్త్రీ సీత అని మాత్రం సూర్యనారాయణ త్రికరణశుద్ధిగా ఊహించుకోలేక పోయ్యాడు. ఏ కోశానా లేకమైనా అందంలేని మనిషి. సౌకుమార్యం లేనే లేని పల్లెటూరి మొద్దు పరాయివూళ్ళో ఎక్కడైనా ఉద్యోగమైతే ఈ గిలక మొహాన్ని వెంటేసుకొని ఎలా వెళ్ళడం ఇది తీరని సమస్యైపోయిందతనికి అందమైన భార్య కావాలనుకోడంలో అసహజమేముంది? అలా కోరుకోకపోటానికి తనకేమిలోటుంది గనక. “సరే అబ్బాయీ! నీకు మేనరికం ఇష్టం లేకుంటే మానె వెళ్ళి ఒక అందమైన అమ్మాయిని తెచ్చుకో నీయిష్టం” అని నాన్న తనకు వదిలేస్తే ఏంచెయ్యాలో కూడా అతనికి తోచలేదు ఏ అందమైన ఆడదొచ్చి ‘నన్ను పెళ్ళిచేసికో’మంటుంది ఈ సంబంధం కాకపోతే తనబంధువుల్లోకూడా మరెక్కడా లేవు వెనకట్నాలపేచీ తను పెట్టుకోదలచుకోలేదు తనెవరైనా ప్రేమించాడా అంటే అదీలేదు. ప్రేమించి పిచ్చెత్తిపోయి విరహగీతాలు పాడుకొనే తత్వంకూడా కాదు తనది. తన చదువు చూచి ఏ ‘అందమైన కూతురున్న మామగారైనా’ వచ్చి తనని అల్లుడిగా చేసికోటాని కిష్టపడతాడేమో అనుకోటానికైనా తన చదువు ఇలా తగులడిందాయెను. ‘బోడి యష్షే’ అన్నట్టు ఆ వెధవ సచ్చిన ‘యష్షే’ ఇంకా తన్ను వదలకుండా ప్రతిఏణ్ణర్థమూ మహా హంగామాగా పూజలు జరిపించుకుంటూ ప్రసాదంలేకుండా పంపించేస్తున్నది. పోనీ తన్ని చూసి ఎవతైనా ఆకర్షింపబడి వెంట పరుగెత్తొచ్చేటందుకు తనేమంత నవమన్మథుడూ కాకపోయె. అత్తగారన్న మాటలు ఇంకా వినిపిస్తూనే ఉన్నవి. ‘ఆ పాపిష్టి దేవుడు మేమిద్దరం పుట్టినప్పుడే రాసి పెట్టాడుట! ఏమంత తొందరొచ్చింది’ అనుకున్నాడు. గుండెలోపల అతిజాగ్రత్తగా ఏడిచేశాడు చేసేదేమీ లేక.

తన్నెప్పుడైనా, కనీసం మాటవరసకైనా, మర్యాదకైనా, అత్తగానీ, మామగానీ అడిగారా ‘ఏంనాయనా పిల్లనచ్చిందా’ అని? పైగా ‘నచ్చకేంజేస్తుంది రాసిపెట్టింతర్వాత.’

ఈ మనుష్యులని ఆ రాసిపెట్టిన దేవుణ్ణీ కలిపి కసిదీరా తిట్టుకున్నాడు.

తనతల్లికీ సంబంధం ఎప్పుడూ ఇష్టంలేదు. ఈ అనాకారిని చేసుకోటం ఆమెకు సుతరామూ ఇష్టంలేదు. అయినా, అందరు అమ్మలకుమల్లేనే కట్టుకున్న మొగుణ్ణి కాదనటం నేర్చుకోని కారణంగా లోపలి భావాలూ, కోరికలూ పైకిరాకుండా లోపలనే దిగమింగుతూంటుంది కొడుకేదో వెలిగిస్తాడనీ, వాడికి చక్కటిభార్య రావాలనీ ఆ కోడలు తనకు చివరి రోజుల్లో సహాయం చేస్తుందనీ కలలుగంటూ పిచ్చితల్లి తనసుఖం కోసం తల్లడిల్లిపోతుంటుంది

పరిస్థితుల నెదిరించి ఆశయాలను కొనసాగించుకోటం పుస్తకాల్లో చదివి మెచ్చుకోవలసిందే గానీ, నిజంగా ఎదురొక్కవలసి వచ్చినప్పుడు చూపించవలసిన కార్యశూరత, కఠోరత తనలో లేవని, అసలు ఇంటా వంటా లేవని అతను నూటవకటోసారిగా అనుకున్నాడు. ‘నాకీ సంబంధం అక్కర్లేదు నాకు నచ్చిన పిల్ల దొరికిందాకా బ్రహ్మచారినై ఉంటా’ నని తండ్రితో చెప్పేయగలిగిన ధైర్యం లేదని గ్రహించాడు. తండ్రిదగ్గర ఎప్పుడెదిరించవలసివచ్చినా పిల్లైపోతాడు నిష్కళంకమైన ప్రేమానురాగాల్ని ఎదిరించే శక్తి తనకు లేదు. ఆయన కూడా చాలా మొహమాటస్తుడు. ‘ఒకే కడుపున పుట్టాం. పుట్టిన అయిదుగురిగ్గానూ ఎలాగో మేమిద్దరం మిగిలాం వయసు చెల్లిన ఈ కాలంలో మా యిద్దరికీ మధ్య మనస్పర్ధలు రేపుకోడం దేనికంటాడు. అన్నీ ఎరిగిన అత్త ఎప్పుడూ ఆయన అభిమానం కదుపుతూ, మరెక్కడా సంబంధాలు వెతక్కుండా ఆయన కళ్ళకు కావలా వేస్తుంది.

చితికిపోయిన సంసారాలు పరిశీలిస్తే అతనికి దొరికిన ముఖ్యమైన కారణం భార్యాభర్తల మధ్య పెరిగే వైమనస్యాలు. తనూ అలాగే – అందరికిమల్లే తృప్తిలేని నికృష్ట జీవితం గడుపుతూ ఛ, ఛా—అలా ఎప్పటికీ జరగకూడదు ధైర్యం కూడగట్టుకొని నాకీ సంబంధం నచ్చలేదని ఎలాగైనా నాన్నగారితో చెప్పేస్తా. ‘ఈ సీత పుట్టకపోయినా బాగుండును’ అనుకొని సీతను తన దృష్టిలోనుంచి మాయంచేసి అప్పటి పరిస్థితులూహించుకొంటున్నాడు

‘సూరి బావా!’ సీత గొంతు క్లిష్టమైన అతని ఊహాపథంలోకి చీల్చుకుని వచ్చింది. ఉలిక్కిపడి చూశాడు. ఆ మాటల్లోని తీయ

# ★ మూక సౌందర్యం ★

విషయంలో తనకు నమ్మకమున్నా తప్పు చేసి సరిదిద్దుకుంటున్నవాడిలా ప్రయత్నించి మనసు రాయిచేసికొని

‘ఏం’ అన్నాడు.

‘నీ కింకా ఎన్నేళ్ళ చదువుంది’

‘ఇంకా రెండేళ్లు.’

‘అబ్బా’ అని సీత ఆశ్చర్యపడిపోయింది. నిజానికి ఆ గడువు భరించరానిదిగా తోచింది ఆమెకి. వెంటనే అంది:

“పెద్ద చదువన్నమాట! అయినా నాకేం తెలుస్తుంది కనక, పల్లెటూరిదాన్ని”

సూర్యనారాయణమనస్సు చివుక్కుమంది. కోపంకూడా ఎత్తుకొచ్చింది అది తన ఉద్దేశంలో అనాగరకురాలయిన సీతపై అసహ్యంగా పరిణమించింది. ఆత్మన్యూనత చేసికొనే వాళ్ళని అత ఎప్పుడూ ఓదార్చకుండా ఉండలేడు

“అన్న మాటేగాని, నాకంటే నీకే ఎక్కువ తెలుసు. నాలు గింగ్లీషు ముక్కలు వచ్చినంతమాత్రాన పల్లెటూరివాళ్లు బ్రహ్మరథం పట్టేస్తారు” ఈమాటలు సూటిగా ఆమెకు తగిలాయేమో అనుకొని బాధపడ్డాడు. సీత కళ్లల్లోకి చూశాడు ఉత్త గాజుకళ్ళల్లా ఉన్నాయి తను కాంక్షించే అనంతాకాశం నీలినీడలు ఎక్కడా గోచరించలేదు. తనంటే ఏదో మూఢమైన విశ్వాసం, వట్టికొని పాకుళ్ళా వేదనం కనుపించాయి. తన మాటల్లో కొంత జాలికూడా ఉన్నట్టు గమనించాడు. అందులో ‘నే నెలాగూ నిన్ను చేసికోవడం లేదుగదా. ఎందుకు నీ కింకా ఈ ఆశలూ అభిమానాలూ?’ అన్న అర్థముంది మొత్తానికి ఆ యింట్లోవాళ్లందరూ తనంటే మితిమీరిన గౌరవం చూపుతూ, “బావా, బావా” అంటూ సీతా, అల్లుడల్లుడంటూ మామా, అత్తా తెగపూసుకొని తిరుగుతూ తన్ను వల్లో వేసికోవాలని చూస్తున్నారు. ఈ నటన అతనికి చిరాకెత్తించింది.

‘మళ్ళా సెలవ లెప్పుడు బావా.’

ఈ మాటల్లోగూడా అతనికి నటన గోచరించి ఎక్కడలేని అసహ్యం వేసింది

‘మళ్లా మళ్లా రానివా. ఎంతాకాలం సెలవులకే’ అదోమాదిరి కోపస్వరంతో అన్నాడు.

శపించినట్టుగా తోచింది సీతకి. లోపల ఆ స్వరకాఠిన్యతకు బాధపడింది. బావకు తనంటే ఎందుకు కిష్టంలేదో తనందంగా లేదని ఆమె అనుకోలేకపోయింది. కాని తన కళ్ళకి బావ మన్మథుడిలా ఉంటాడు. ఇంతలో తల్లి కేకేస్తే, సీత వెనక్కు తిరిగి వెళ్ళిపోయింది. ఆమెను చూస్తూ తలుపు కానుకొని నిలబడ్డాడు సూర్యనారాయణ.

అది గమనించిన సీత అడుగులు తొట్రుపాటు చెందాయి.

* * *

‘నా పెళ్లి కప్పుడే తొందరేమిటి. చదువు పూర్తయినతరవాతగానీ చేసికోను’ అంటూనే ఒక సంవత్సరం ఆ ప్రస్తావన రానీకుండా గడుపుకొచ్చాడు సూర్యనారాయణ. ఒక రోజున అనుకోకుండా నాన్నగారివద్ద నుంచి జాబొకటి వచ్చింది. ‘పెళ్ళి కన్ని ఏర్పాట్లూ అయినాయ్ ఈ శ్రావణంలోనే మంచిముహూర్త ముంది నువ్వు సెలవు పెట్టి రావలసింది’ ఇదీ సారాంశం.

బాగా ఎరిగున్న స్నేహితుడొకడు సేవకుడా కొచ్చి సూర్యనారాయణని రైలెక్కించి ముహూర్తంనాటికి తప్పకుండా వస్తానని మాట ఇచ్చాడు. ఓదారుస్తూ అన్నాడు స్నేహితుని బాధ గ్రహించి “అందం కోరుక్కుతింటావా అలా అని కురూపిని చేసికొమ్మని నా ఉద్దేశం కాదు. మీ అత్తకూతురు అంత కురూపిఅంటే నే నెందుకో నమ్మలేకుండా ఉన్నాను. ముఖాని కందం లేకపోయినంతమాత్రాన మనసు మంచిదీ గాదని అనటం తప్పు నన్నడిగితే మనస్సుకుకూడా సౌందర్యముంటుంది. దాన్ని గుర్తిస్తేనే కాని జీవితం సఫలమౌతుంది. అంతం రేపు నశిస్తుంది కాని ఆ సౌందర్యం కలకాలం నిలుస్తుంది”

‘ఏమిటో ఈ వేదాంతం’ అనుకున్నాడు సూర్యనారాయణ మనస్సులో తీవ్రమైన అసంతృప్తి చెలరేగుతున్నది. తనకు సీతమీద ఉండే విముఖతవల్ల సంసారంలో రాబోయే తుపానుల నూహించుకొని అతని మనస్సు ఆందోళన పడసాగింది తను భావన చేసికొంటున్న ఊర్వశి వచ్చి కడపటిక్షణంలో రక్షిస్తుందేమో అనుకున్నాడు. కాని పెళ్ళి బాజాలశబ్దంలో ఆ ఆశకూడా అంతరించిపోయింది.

విషయం తన చెయిదాటి పోయిందన్న సంగతి నాన్నగారు తన్ను సంప్రదించకుండా రాసినఉత్తరంతోనే తేలిపోయింది. ఒక్కసారైనా నాన్నకీ, అమ్మకీ తన అయిష్టత వ్యక్తంచేయటం కనీసధర్మంగా భావించి తెగింపుచేసి ముహూర్తం ముందు రోజు నాన్న వింటుండంగా తల్లిముందర నోరు జారాడు. ‘నాకీసంబంధం ఏమాత్రం నచ్చలేదు. నన్నడక్కుండా ఎందుకు తల పెట్టారు పెళ్ళి నాకొద్దు మీకొద్దు’ అని

ఆయన ఆగ్రహోద్రిక్తుడైపోయాడు పెదిమలు వణికిపోయాయి ఎఱ్ఱబడ్డ కళ్ళల్లోంచి దెబ్బతిన్న అభిమానం కన్నీరై కారిపోయింది. ‘ఫో నీయిష్టమైనచోటికి వెళ్ళి నీయిష్టమైనదాన్ని చేసికో నేనేమీ అన్ను. సినిమాతారలను పోకిళ్లాలను తెచ్చి వంశం భ్రష్టం చెయ్యలేను’ ఆ రౌద్రమూర్తి అంతలో ద్రవించిపొయ్యాడు దగ్గరకొచ్చి కౌగిలించుకొని జుట్టు నిమురుతూ “చదువుకొన్నవాడివి నువ్వు అలా అంటే ఎలా చెప్పు నాయనా? పోషణలేక, తగిన చదువు లేక అలా ఉందిగానీ మహాలక్ష్మిలా ఉంటుంది. దాని హృదయం నీకింకా తెలీదు” అన్నాడు తనూ తండ్రి కౌగిలింతలో తల దాచేసుకొని ఏడిచాడు

ఇంతలో అత్తగారో పనిమీదొచ్చి ముగ్గురూ చెమ్మగిల్లినకళ్లతో ఉండటంచూసి గిరుక్కున వెనక్కు వెళ్ళిపోయింది.

* * *

అగ్నిసాక్షిగా సీత సూర్యనారాయణ భార్యైపోయింది. చాలా వైభవంగా గడిపాడు అంత కూడావిశేలోనూ. చాలా మంది ఆశ్చర్యపోయారు. అతను తిరుగా కాలేజీకి వెళిపోయాడు. మళ్లా స్నేహితుడన్నాడు ‘అందమెందుకు కొరుక్కు తిన డానికి పట్నవాసంలో పెరిగిన నీకు పల్లెటూరి మొహాలు బాగుండకపోవచ్చు గానీ, మీ యిదరికీ ఈడూ జోడూ కుదిరిందనే నాకనిపించింది’

‘నీకో శూర్పణఖ దొరికితేనే గానీ ఈ వేదాంతం మానవు’ అన్నాడు సూర్యనారాయణ.

అందంలేని స్త్రీని నిజంగా ప్రేమించడం మహాసాధన చేస్తేనే గానీ నాలాంటివాళ్ళకు చేతగాదు నా జన్మనక్షత్రం బద్ధలైపోయి దాని ప్రభావమేదైనా న మీగుంటే తప్ప నేను సీతను ప్రేమించలేను అనుకున్నాడు. తీవ్రమైన అసంతృప్తి అతని మనస్సులో దావానలంలా వ్యాపించి,ఆక్రమించి దహించేసోంది ‘అందం లేదు అందం లేదు’ గుండెల్లో ప్రతిధ్వనిస్తున్నాయి ‘పిశాచిలా నాపక్కని కూర్చుంది’ అనుకున్నాడు ఫొటో చూసి.

ఈ మొహానికి జాబొకటి ‘ప్రియమైన సీతా! నీకు నా ముద్దులు’ ఒక్కసారి ఎక్కడలేని నవ్వు ముంచుకొచ్చింది. వెంటనే అసహ్యం తుపానులా లేచింది. ఛీ, ఛీ ఈ మొహాన్ని ముద్దు పెట్టుకోవడం ఎలాగ మనస్సును ముద్దు పెట్టుకోవాలి. తన్ను తాను సమాధానించుకొని నవ్వుకున్నాడు పొరాలమీదకి బొత్తిగా మనసు పోవటంలేదు. ప్రతి అక్షరం మధ్య అందం లేని సీత మొహం కనపడి అసంతృప్తీ, అసహ్యం రేకెత్తిస్తున్నది ఏతిరు ... రాదామని నాలుగైదుసార్లు ప్రయత్నించి రాయలేక విసుగెత్తి విరమించుకున్నాడు మనసులోని మధురభావాలూ జాబుల్లో ప్రియమైన ‘ ’కి ప్రాంద్దామనుకొన్న ఆశలన్నీ వ్యర్థమైపోయినాయ్

కష్టపడి యస్. యస్. ఎల్. సి. పాసై సూర్యనారాయణ బి. ఏ. లో కొచ్చాడు. ఆ సంవత్సరం క్రిస్మస్ సెలవులకి ఇంటికి వెళ్ళాడు. రైలో! ఎక్కుతున్నప్పుడే ఒళ్ళు వేడెక్కి కాళ్ళల్లో బలహీనత గోచరించింది. రైల్లో పిచ్చిపిచ్చిగా ఆలోచిస్తూ కూర్చున్నాడు 'ఏదన్నా పెద్ద జబ్బు చేసి, లేక గుండె హఠాత్తుగా పగిలిపోయి నేను చచ్చిపోగూడదూ' అనుకున్నాడు. వెధవ ప్యాసింజరు రైలు మూడుగంటల ఆలస్యంతో తన వూరికి మధ్యాహ్నం పన్నెండు గంటలకి చేరింది. ఆ వేళ ఆ స్టేషన్లో తను తప్ప మరెవ్వరూ దిగలేదు. ఆ స్టేషన్ ఏదో ఎడారిలో ఉన్నట్టు భావించాడు. జట్కాలో యింటికి బయలుదేరాడు. రేగిపోయిన జుట్టూ, మసిబారిన బట్టలూ, పీక్కుపోయిన మొహం తనమీద తనకే అసహ్యం వేసింది కళ్లు చిమ-చిమలాడిపోతూ మండుతున్నాయి. ఆ పరిస్థితుల్లో అతనికో భావం వచ్చి గుండె గతుక్కుమంది. వెంటనే తనలో తాను నవ్వుకున్నాడు. ఆ కాళరాత్రి ఒంటరిగా బండిలో ప్రేమించిన పార్వతి కడసారి దర్శనంకోసం ప్రయాణిస్తూ రక్తం కక్కుకొని, దిక్కులేక మరణించిన దేవదాసు జ్ఞాపకం వచ్చాడు తనూ అల్లాగే మరణిస్తే ఎంత బాగుంటుంది. తనింకా ఊహించుకొనే లోపల గమ్యస్థానం వచ్చి జట్కా ఆగిపోయింది నెమ్మదిగా దిగి ఇంట్లోకొస్తుంటే గుమ్మందగ్గర సీత ఇంత కుంకుమబొట్టు పెట్టుకొని నిల్చునిఉంది తలొంచుకొని పలకరించకుండా లోపలికెళ్ళి మంచం లాక్కొని వాలిపోయాడు.

సాయంత్రం అయిదింటికి కళ్ళు విప్పి చుట్టూ వాతావరణాన్ని అర్థం చేసికోటానికి ప్రయత్నించాడు ఆ యింట్లో అందంలేని భార్య ఉన్నట్టు అతనికి గుర్తొచ్చింది మళ్లీ ఎన్నో భావాలు అతని మనస్సులో దట్టంగా అలముకొన్నాయ్ అందమైన భార్య ఉంటే ఈ జ్వరం వచ్చిఉండేది గాదేమో అనుకున్నాడు వచ్చినా తన కెన్ని విధాల సేవలు చేస్తుందో ఊహించుకొంటుండగా సీత వచ్చి కాఫీ కప్పు మంచంపక్కనే ఉన్న బల్లమీద పెట్టింది దగ్గరకొచ్చి నుదుటిమీద చేయివేసి చూసింది అతని నుదురు ఆమెకు భగ్గుమని మండిపోతున్నట్లనిపించింది ఆమె చేతిస్పర్శకూడా సూర్యనారాయణకు భగ్గుమనిపించింది అందమైన భార్య చేయైతే చల్లగా ఉండేదనుకున్నాడు కాఫీ తాగకుండానే ముఖం పక్కకి తిప్పేసుకొని పడుకొన్నాడు

మర్నాడు ప్రొద్దున్నే కళ్లు విప్పి చుట్టూ కలయచూశాడు చిన్నతనంలో చదువుకొన్న రూమది ఏవేవో స్మృతిపథంలో మెదిలాయ్. అల్లారి నిక్కి నిక్కి చూస్తూన్న కాఫీ కప్పు కనిపించింది. ఎవరికో అన్యాయం చేసినట్టు తోచింది రాత్రి విషయాలన్నీ లీలగా జ్ఞాపకమొస్తున్నాయ్ అమ్మ గొంతుకలా ఉంది ఎందుకో నీరసం న్నది. ఎందు కేడిచిపుంటుంది. ఈ కాన్యరానికి. పాపం. తల్లి హృదయం అంత మెత్తనిది కాబోలు. చెయ్యిమీద దురద పుట్టింది. ఏదో పొక్కు-లాగుంది. చేతిమీద చాలా పొళ్లు ఉన్నాయి గుండెలమీదా మొహంమీదా, అరె. రాత్రికిరాత్రి ఎక్కు

# ★ మూక సౌందర్యం ★

ట్టించి ఒచ్చాయి పొక్కులు. గుండె గతుక్కుమంది. భయం విద్యుద్వేగంతో ఒళ్ళంతా ప్రసరించింది. ఏమిటిది మశూచికం కాదుగదా ఉండబట లేకపోయాడు. 'అమ్మా' అని కేక వేశాడు. తల్లి వచ్చింది విత్తరచూపులు చూస్తూ. 'ఏం నాయనా. బాగా నిద్దరపట్టిందా' 'ఇవేమిటమ్మా' అన్నాడు. 'ఏదో విషజ్వరం నాయనా. మరేం ఫరవాలేదు. తొందర్లోనే నిమ్మళించి పోతుంది'

'ఇది మశూచికం కాదూ'—దివ్యవీణా నినాదంలో అపశ్రుతి లాలికినట్లుందా స్వరం.

అతని దృష్టి మందగించింది. ఆ రూముగోడలు గిర్రని వరిభ్రమిస్తున్నయ్. అగ్నిపర్వతాల చివళ్లు పేలి బాగలు కక్కుతున్నట్టనిపించింది. కింద భూమి చీలిపోయి, అగాధాలేర్పడి-తినా అగాధాల్లో మంచంతోపాటు విసిరి వేయబడుతున్నట్టుంది. ఒళ్లు కంపించింది. కళ్లువిప్పి తనఒళ్లు చూసుకొన్నాడు. అనుకొన్నంత ఘోరంగా ఇంకా శరీరం మారి పోలేదనుకున్నాడు. ఎఱ్ఱబడ్డ కళ్ళల్లోంచి ఇందుపగింజల్లాంటి నీటిబొట్లు టపటప రాలిపోయాయి. 'హా శిక్షి దేవుడా! నువ్విచ్చినఅందాన్నే తిరిగి తీసుకొంటున్నావటయ్యా! ఎందు కింతకోపం. ఏంచేశాను నేనేంచేశాను. నీ కెందు కింత నిర్దయ భగవాన్.' దిండులో తలదాచేసుకొని అవమానభారంతో ఏడిచాడు.

'అందం భరించలేని అసూయాదేవత ఈ మశూచికం. ఒళ్ళంతా బీభత్సంగా తయారయిపోతుంది. మచ్చల్తో ఒళ్లంతా సందు లేకుండా నింపేస్తుంది. శాశ్వతంగా నున్నటి ఈ మొహం గతుకుగతుకులైపోతుంది ఇహ నన్నే ఆడదీ చిరునవ్వుతో చూడదు

సీత వేపమండతో వీస్తూ పక్కన నిలబడింది. బలవంతంగా రెప్పలు పైకెత్తి సీత మొహంలోకి చూశాడు. 'ఎంత అందంగా ఉంది' అత నాశ్చర్యపోయాడు. 'ఇన్నాళ్లవరకూ ఎక్కడ దాగివుందీ అందం. ఎంత దౌర్భాగ్యుణ్ణి. "ఆ పచ్చటి చీరలో ఎలా మెరిసిపోతున్నదో సీత. ఆ కుంకుమబొట్టు కూడా ముఖాని కేదో కళ ఆపాదిస్తున్నది ఆ పల్చటి ఎఱ్ఱటి పెదవులూ, సూర్యకిరణాల్ని ఇంద్రధనస్సు ఏడురంగుల్లోకి విరజిమ్మే ఆ కళ్లూ ఎంతబావున్నాయి. నాదేమి అందం ఇంక నాలుగురోజులవరకూ ఉంటుంది. తరువాత నాతోపాటే నశించిపోతుంది. మశూచికం వచ్చినవాళ్లు సాధారణంగా బ్రతకరు' అతని కళ్లు చెమ్మగిల్లాయి సీతమొహంలోకి నిర్విరామంగా చూస్తున్నాడు అమాయికంగా తన్ను చూసి భయపడిపోతున్నది. అందమైనభార్య అతనికళ్లముందు సాక్షాత్కరించింది. తన్ను చూచి ఏవగించుకుంది. గజ్జికుక్కని తోలేసినట్లు తనని దగ్గరకి రానిద్దంటూంది. అద్దంలో తన అందాన్ని చూసి మురిసిపోతున్నది. శవాన్ని చూసినట్లు తనవైపుమాసి పరుగెత్తిపోయింది ఒళ్లంతా ఒక్కసారి ఉలిక్కిపడ్డట్లు కదిలిపోయింది చివరకేం మిగిలిందన్నట్టుగా కళ్లతో ప్రశ్నించాడు సీతని. ఆశించినఅందం తనకు దొరకలేదు సరిగదా తనకు మిగిలిన అందం కూడా అంతరించిపోతున్నది.

ఏదో నరకంలో ఎక్కడా పట్టుదొరక్క కూలిపోతున్నాడు. స్వర్గలోకం మణిమయ ద్వారాలు తెరుచుకున్నాయి. సీత బయటికొచ్చి చెయ్యి విసరింది. ఆ వేళ్లుపట్టుకొని పైకెగబాకుతున్నాడు. సీత సౌందర్యం సహస్రగుణాధికమై ప్రకాశించింది. సీత రెండుచేతులూ చాచి పైకి లాగి దగ్గరకి తీసుకుంది.

స్మృతిపథంలోంచి మళ్ళీ విడివడి తన ఒళ్లు చూసుకొన్నాడు. పొక్కులలాగే వున్నయ్. తను చచ్చిపోవటం నిజం. 'నిన్నన్యాయంచేశాను సీతా' అని గొణుక్కున్నాడు. సీత భయపడి లోపలికెళ్ళి అత్తని పంపించింది.

'తిరుపతి వెంకన్న ఎప్పుడూ అన్యాయం చేయడు' ఆ తండ్రికి మొక్కుకో నాయనా మళ్ళీయేటికి నీ పాదాలమీద వాల్తానని" తల్లి విశ్వాసానికీ దైవభక్తికీ కదిలిపోయ్యాడు లోలోపల ఆ సర్వశక్తిమంతుడైన పరమేశ్వరుడికి నమస్కరించాడు. మశూచికం పొంగినట్టే పొంగి తగ్గిపోయింది. తొమ్మిదో రోజున స్నానం చేయించారు. ముఖమేమీ వికృతంగా తయారుకాలేదు. ఎవరూ చూడకుండా అద్దంలో చూసుకున్నాడు. గుండె చాలా తేలికపడ్డది. నిర్మాల్యం తీసేసి తిరుగా స్వామినలంకరిస్తే ఉండే సొగసూ సౌందర్యమూ అతనిలో గోచరించాయి

మన్నాడు తెల్లవారుఝామున నాలుగున్నరకి మెలకువొచ్చి దాహం వేసింది. మరచెంబులోనుంచి నీళ్లొంచుకోబోయి పట్టుజారి కింద బడవేశాడు. ఖంగుమని శబ్దమైంది.

సీత భయపడుతూ లోపలకొచ్చి లాంతరు పెద్దది చేసింది నలుమూలలకూ చెదరిపోయిన కుంకుమబొట్టుతో ఆమె నుదురు అరుణరాగా లలముకొంటూన్న ఉదయాకాశంలా ఉంది

'ఏం బావా ఏం కావాలి'

సూర్యనారాయణకు స్నేహితుడిమాటలు జ్ఞాపకం వచ్చాయి "మనస్సుకి సౌందర్యముంటుంది అది కలకాలం నిలుస్తుంది"

'ఇంకా బావా గీవా ఏమిటి' అన్నాడు.

'ఏమనమంటారో చెప్పండయితే'

'అండి అంటే నా ఒళ్లు మండిపోతుంది'

సీత నవ్వింది. మనస్సులో ఉన్న నిర్మలమైన సౌందర్యం పైకి పొంగి పొరలి తనను చూడమన్నట్టుగా ఉందా నవ్వు.

పక్కకు జరిగి కూచోమన్నాడు కాసేపు సంశయించి మంచంపట్టెమీద కూర్చొంది. సూర్యనారాయణ తన వేళ్ళూ సీత వేళ్ళూ చూసికొన్నాడు తన వేళ్ళమీద ఇంకా మచ్చలున్నాయి

సీత వేళ్లు తన చేతిలోకి తీసికొని 'ఎంత బావున్నాయో చూడు' అన్నాడు

ఆమె మాట్లాడలేదు.

'నే నొక ప్రశ్న అడుగుతా జవాబు చెపుతావా'

'అడగండి'

'నేనింకా అందంగా ఉన్నానా.'

సీత రెండుచేతుల్తో మొహం కప్పేసుకొని ఏడిచింది. ఏదోలోకంనుంచి మాట్లాడినట్టుగా అంది.

'మీ కందమైన భార్య రావాలనే కోరుకునేదాన్ని' 'ఛ, ఛా ఏమ్మాటలవి'

వెక్కి వెక్కి ఏడుస్తూన్న సీతని సముదాయించాడు దగ్గరికి లాక్కొని

'నీ కందం లేకపోయినా ఆత్మసౌందర్యముంది. నా కదే చాలు'

ఆశ్చర్యంతో సీత కళ్లు పెద్దవి చేసింది—మనస్సును చూడమన్నట్టుగా. తరువాతెవరూ చాలాసేపటివరకూ మాట్లాడుకోలేదు. భాష వ్యక్తీకరించలేని ఏదో మధురమైన అనుభూతికి పరవశులై ఇద్దరూ మూగవోయినటుగా, ఆ దివ్యానుభవం మాటల్లో ఖర్చైపోతుందేమోనన్నట్టుగా శూన్యంగా దిక్కుల్లోకి చూస్తూ ఉండిపోయారు. ★




# ఆయుర్వేదము: ఆహారము

"బాలెంతలకు పెట్టే తెలికపిండి అందరికీ ఉపయోగకరమైన ఆహారమవుతుందా? ఎన్నటికీ కాదు" అంటారు ఆయుర్వేద పరిషత్తు మాజీ అధ్యక్షులైన శ్రీ వేదాలతిరుమల రామానుజస్వామి గారు.

"ఆయుర్వేదశాస్త్రరీత్యా ఒకేవిధమైన ఆహారము అందరికీ ఉపయోగపడదు. స్త్రీపురుషులకు వేరు వేరుగా ప్రకృతినిబట్టి, పరిస్థితినిబట్టి, ఆహారము నియమించవలసి ఉంటుంది. స్త్రీలకు ఋతుమతిగా ఉన్నప్పుడు, చూలింతగా ఉన్నప్పుడు బాలెంతగా ఉన్నప్పుడు, ఆరోగ్యవతిగా ఉన్నప్పుడు భిన్న భిన్న తత్వములుగల ఆహారము అవసరము. ఈవిధముగానే పురుషులకు బాల్యావస్థలో, యువక తరుణావస్థలలో వాడవలసిన పదార్థాలు వేరు, వృద్ధాప్యములో వాడవలసిన పదార్థాలు వేరు. తిలపిణ్యాకము (తెలికపిండి) బాలెంతల ఆహారము ప్రసవించిన తరువాత కలిగే దోషాలవల్ల స్తన్యవృద్ధి కలుగదు. ఆ దోషమును తెలికపిండి పోగొట్టుతుంది. ఈ పిండియే యౌవన తరుణావస్థలలో ఉన్న పురుషులకు ఆరోగ్యము చెరచి దేహమును ఆర్పుతుంది. ఇది పసిబిడ్డ తల్లులకు తగిన ఆహారము గాని ఇతరులకు కాదు రుచికోరకు అప్పుడప్పుడు వంటకాలలో వాడుకొన తగినదిమాత్రమే" అంటారు ఆయుర్వేద వైద్యులు.

"వేరుసెనగ అనపజాతిలో చేరినది. చిక్కుడు, తమ్మ ("చెమ్మచెక్క చారడేసి మొగ్గ" పాటలోని చెమ్మ తమ్మ ఒకటే) బటానీలు, చిరుసెనగలు, ఉలవలు, అలచందలు, మినుములు ఈ జాతిలోవే. వేరుసెనగ మధురరసము శీతవీర్యము అయిన వస్తువు. ఈ పిండి పశువులకు ఉపయోగించ తగినది. దీనివలన మజ్జ అస్థి పెరుగుతాయి.

ఇల్లిందల సరస్వతీదేవి

కాకానుగతమైన ... వైద్యమును ... కలిగిస్తుంది. ఇది పురుషులతత్వానికి సరిపడని పదార్థము. దీనివల్ల అప్పుడప్పుడు ప్రాణాపాయముకూడా కలిగే సంభవము ఉన్నది" అన్నారు.

వేరుసెనగపప్పును వేయించి ఉప్పుకారము కలిపిగాని, నానబెట్టి రుబ్బినతరువాత వచ్చిన పాలతో పిండివంటచేసిగాని ఉపయోగించినట్లయితే దోషము లేదు. దీనిని ధాతుప్యపదార్థములతో నేతితో గాని నూనెతో గాని తయారుచేసినట్లయితే జబ్బు చేయదు.

వేరుసెనగలను వేయించి పలుకుగా దంచి, సన్నబియ్యము కలిపి తడిపి, ఉప్పుకారము జీలకర్ర లేక ఓమము చేర్చి బజ్జీలుగాగాని, గారెలుగాగాని చేసి ఉపవసించినవాడు భుజించినట్లయితే దేహానికి మంచిది.

వేరుసెనగపిప్పిని ఎరువుగా ఉపయోగించి కాయించిన పండకాయలవల్ల మనిషికి పుష్టి.

మన ప్రధానాహార ధాన్యమైన వడ్లలో కాపసేయము, షాష్టికము, శాలీ, మహాశాలీ, కలమ, మహారాజనము, రాజాదనములు, సౌగంధికాలు, మహాసౌగంధికాలు, రక్తశాలి, దీర్ఘశూకములు (తోక వడ్లు) బంగారు తీగెలు, శ్రేష్ఠమయినవి. వీటిలో శాలీ మహాశాలీ రకాలను నిజాము గౌడ అంటారు. మహారాజనాలను సన్నబియ్యము పిఠోడీ లంటారు. వీటిలో రక్తశాలి శ్రేష్ఠమైనదీ దాహశమనము చేయగలదీను. మహాశాలీ, కలమ, బంగారుతీగెలు, సౌగంధికములు ఉత్తమశ్రేణికి చెందినవి.

బియ్యము మూడు పర్యాయములు కడిగి వడవేసినవాటిని, ఎసట్లో పోసి వండిన అన్నము సులభముగా జీర్ణమవుతుంది. అర్ధ ఎసరు (అత్తెసరు) ఒంటికి బలము. వార్చిన గంజిని చారుగా ఉపయోగించుకోవచ్చును.

బియ్యమును పదహారు విధములైన ఆహారముగా తయారుచేసుకోవచ్చు. ఈ సౌకర్యము ఇతర ధాన్యాలకు లేదు. అంతు

(30-వ పేజీ చూడండి)



—ఫొటో: ఉప్పలూరి వెంకటశ్రీనివాసరావు, విజయవాడ.

కొరకే బియ్యము ఆహారధాన్యాలలో ప్రముఖస్థానము వహించినది.

మన ఆహారధాన్యాలలో ఉష్ణవీర్యము కలవి గోధుమలు, శీతవీర్యముకలవీ తక్కువ బలము కలవీ యవలు.

తృణధాన్యాలలో చామలు (శ్యామాగములు) కొఱ్ఱలు తమిదలు చేరుతాయి. ఈ మూటిలో చామలు శ్రేష్ఠము. వరిలోఉన్న గుణాలు ఇంచుమించుగా చామలలో కొఱ్ఱలలో ఉన్నాయి.

కందులు, సెనగలు, పెసలు, మినుములు —వీటిలో ఎక్కువ శ్రేష్ఠమయినవి పెసలు. వీటిని పప్పుగా ఉపయోగించటను ఉత్తమము. పెసల తరువాత కంది, సెనగ, తరువాత మినుములు శ్రేష్ఠము.

మినుములు స్త్రీలకు పురుషులకు సమగుణాత్మకముగా పనికివచ్చు ఆహారధాన్యము. వీనిని వీలయినంతవరకు వేయించి, పప్పు చేసి, పిండిచే ఉపయోగించాలి. (మినపసున్ని) సానబెట్టి ఉపయోగించినట్లయితే పొట్టు కూడా ఉండటము అవసరము. వేయించి విసరినప్పుడు పోగా మిగిలిన పొట్టు నైనా ఉండనివ్వటము మంచిది. పొట్టులేని పప్పు వాడినట్లయితే రక్తప్రసారము సరిగా కాకపోవటము, అజీర్ణము కలగటము, కఫము పెరిగి శోషము ఊరటము, అనేక ఉదరవ్యాధులు రావటము సంభవిస్తుంది.

నువ్వులలో గడ్డినువ్వులు ప్రధానమైనవి వీటిలో నల్లనువ్వులు శ్రేష్ఠమయినవి. నువ్వుల నూనె సర్వదేశీయముగాను, పిండి ఏకదేశముగాను ఉపయోగించుకోవాలి. గడ్డి నువ్వులలో నూనె తప్ప, పిండిని మనుష్యాహారముగా ఉపయోగించటానికి వీలు కానిది. మిగతా ధాన్యాలలో నూనెలకు పనికివచ్చే ధాన్యజాతులు మరికొన్ని ఆముదాలు, పిచ్చికుసుమ, కుసుమ, అవిసెలు, ఆవాలు, నక్కెర గింజలు, కొబ్బరి, తాటి మొదలైన అరవై జాతులు ఉన్నాయి. వీటిలో వేపకూడా చేరినది.

వ్యాధులలోను, నిరోగతకొరకు ఉపయోగించేవి ఆముదము నువ్వులనూనెమాత్రమే. కుసుమనూనె కుష్ఠువును పుట్టిస్తుంది.

మనము వాడుకొనేకూరలు నాలుగురకములయినవి - కాయ, దుంప, ఆకుకూరలు, కందములు.

కాయలు: పొట్ల, బీర, కాకర, అడవి కాకర, గుమ్మడి, సొర, బూడిద గుమ్మడి, దోస, ఏనుగుదోస, బుడమ మొదలైనవి వీటికి లతావితానశాకములని పేరు తీగలుపాకి కాసేవి రామములక, (టొమాటో) కర్బూరవంకాయలు ఈజాతికి చెందినవే.

తుపవితానములు: బెండ, వంగ, మిరప, కామంచి, మునగ, గోరుచిక్కుడు మొదలైనవి.

కొమ్మలు, ఆకులు, కాయలు ఉపయోగించేవాటిలో మునగ, అవిసె చేరుతాయి.

కందములు మూడురకములు: పత్రకందములు, గుల్మకందములు, పుష్పగుచ్ఛములు. వీటలో పత్రకందములు కాబేజి లెట్యూస్; పుష్పకందము గోబీపువ్వు; గుల్మకందము పెండలము చేమ, చిలుకడదుంపలు, ఉర్లగడ్డ, కంద. దుంపలలో కంద శ్రేష్ఠమైనదీ గొప్ప శక్తిప్రధానమైనదీను. గాజరగడ్డలు కూడా ఈజాతిలో చేరినవే ఉల్లిగడ్డలు అంత శ్రేష్ఠమయినవి కావు.

ఆకుకూరలు: సరస్వతి పొన్నగంటి, పులిచింత, చుక్క, గోగు, బచ్చలి, కామంచి, చేమతోటకూర, కొయ్యతోటకూర, పెరుగుతోటకూర. వీటిలో శ్రేష్ఠమైనది సరస్వతి మేధావర్ధకము. బచ్చలి, పొన్నగంటి సర్వవ్యాధిహరమూ, ఆరోగ్యరక్షణమూను చక్రవర్తి ఆకుకూర సర్వకాలములలో ఉపయోగపడేది. ఎండబెట్టి పొడిగా దంచి అన్ని కూరలలోను వాడుకొనవచ్చు. పురుషులు ఎక్కువగా ఆకుకూరలు తినరాదనీ, అవి శౌర్యమును తగ్గించి సాత్వికమునే పెంచుతాయనీ వైద్యులు అంటారు కనుక ఆకుకూరలను కూరాదులలో వాడుకొనవలసి ఉంటుంది. కాని ఈ సూత్రము గోంగూరకు మాత్రము వర్తించదు. ఆకుకూర నిత్యోపయోగములో ఉండతగినది.

ఆహారపదార్థములలో మూలములు కూడా చేరినవే. సుగంధిపాల రెండు తెగలు, చిత్రమూలము, ఎఱ్ఱతోటకూర పెరుగుతోట



కుమారి మీనాక్షి నృత్యభంగిమ

కూర కొడలు, బచ్చలి దుబ్బులు మూలకములలో చేరినవి.

ఫలములు: మామిడి, నిమ్మ, గజనిమ్మ, నారింజ, మాదీఫలము, దబ్బ, కమలా ఫలము, బత్తాయి, వాకుడు (చిన్న, పెద్ద), అత్తిపండు, పాలపండు, చిటిమిటిపండ్లు వెలగ, మారేడు, అరటి, జేము, నేరేడు, దానిమ్మ మొదలయినవి ఆహారములో చేర్చ తగినవి.

ఈ ఫలాలలో నిమ్మ సర్వశుద్ధిరసము, మాదీఫలము సర్వసిద్ధిరసమూ కలవి.

మామిడిపండు వాతహరణము. పచ్చికాయ కఫకరము. అరటి జేమ బలవర్ధకము, కాని అజీర్ణకరము కనుక జాగ్రత్తగా వాడవలసి ఉంటుంది. అరటిలో కాయ, పూత, పండ్లు దూట అన్నీ ఆహారములో ఉపయోగింపబడేవే.

నేరేడు రక్తవర్ధకమూ మారేడు ఆరోగ్యవర్ధకమూను. జేమ శుక్రవర్ధకము. జేమ పండ్లలో గింజలు తక్కువగా ఉన్నవి శ్రేష్ఠము. దీనిలో చక్కెరచేర్చి భుజించటము మంచిది. అంజూర సర్వధాతువర్ధకము. దానిమ్మ పిత్తహారమూ బలకరమూ అయినది. ఇది సర్వధాతువర్ధకము. రుచిగల ఫలము. దానిమ్మలో తీపిజాతి శ్రేష్ఠము.

ఆహారపదార్థాలలో బియ్యము గోధుమలకు ఎంత ప్రాధాన్యము ఉన్నదో పాలకు కూడా అంత ఉన్నది. ఆవు, బఱ్ఱె, గొఱ్ఱె, గుఱ్ఱము, మేక, ఒంటె, ఏనుగు, గాడిదల పాలు కూడా మానవాహారములో ఉపయోగకరములే.

వీటిలో ఆవుపాలు 10 గుణములు కలవి. బఱ్ఱెపాలలో కూడా ఇంచుమించుగా ఆవుపాలలో ఉన్న గుణాలే ఉన్నాయి. కాని ఆలస్యముగా జీర్ణమవుతాయి. మేకపాలు క్షయహారము. గాడిదపాలు కఫహారమూ ప్రసూతిరోగహారమూను. ఒంటెపాలు బలకరమైనవి. ఈపాలతో ఉదరరోగములు హరింపబడును. ఏనుగుపాలు బలకరము. గుఱ్ఱపుపాలు వ్యాధిహారము. వాతెంత జబ్బులు ఈపాలతో నివారణ కాగలవు. గొఱ్ఱెపాలు దేహానికంత మంచివి కావు; కఫవర్ధకమైనవి పాలవలెనే ఈ జంతువుల యొక్క పెరుగు నెయ్యి వాడతగినవి. వీటిలో ఆవునెయ్యి ఉత్తమోత్తమమైనదీ, శరీర ప్రాణపోషకమూను.

బఱ్ఱెపాలవలెనే నెయ్యికూడా ఆవునేతి కంటె తక్కువ గుణములుకలది. బలకరమైనదే గాని - కఫకరమైనది. మిగతా జంతువుల ఘృతములు వాటి పాలవలెనే వాడతగినవి.

పులి, సింహము, గుడ్డేలుగు ఎనుబోతు మొదలైన మృగములయొక్క పాలు, జున్ను, పెరుగు, ఘృతము వస మజ్జ వ్యాధులనుబట్టి ఉపయోగించుకొనవలసినవి.

బెల్లము పంచదార మొదలైన ఇక్షు వికృతులు చెరకు వికారములు. బెల్లము, పటిక బెల్లము, పంచదార, మొదలైనవి కూడా ఆహారములో ఉపయోగించవలసిన అవశ్యకత ఉన్నది.

పండ్లలో చింత నిమ్మ ప్రతినిత్యోపయోగములుగా ప్రసిద్ధమైనవీ, ప్రసిద్ధిగాంచినవీను. ఈ ఆహారోపద్రవ్యాలయందు గర్భిణీ శిశు వృద్ధులు వాడతగిన అనేకవస్తువులు ఇంకా వివరముగా తెలియజేయవలసినవి గలవు. ఆహారపదార్థాలలోని గుణవిచారమే కాకుండా తత్వవిచారముకూడా చేయవలసి ఉంటుందని ఆయుర్వేదశాస్త్రజ్ఞుల అభిప్రాయము.

ఆయుర్వేదశాస్త్రరీత్యా ఎటువంటి ఆహారము ప్రజలకు ఉపయుక్తమో నిర్ణయించటానికీ, దానిని చౌకగా ప్రజలకందించటానికి తగిన పరిశోధనలు చేయుటము అవసరము. దీనికి ప్రభుత్వసహాయము, ప్రజాదరణ కావలసిఉన్నవి. ★

# ఇదీ వ్యాపారమే!

## 1

ఫోను రింగైంది.

"హలో!"

"    "

"ఆఁ! ఏమిటి?"

" . . "

"నే నెందుకు?"

" . "

"తప్పదంటే సరే!"

" . . . ."

"ఓ. కె"

ఫోను కింద పెట్టాను. నాకంతా అగమ్యగోచరంగా వుంది. చంద్రరావు ఫోను చేశాడు. అతనెవరో పెళ్లిచూపులకు వెడుతున్నాట్ట. నన్నూ రమ్మనమంటాడు. మధ్య నే నెందుకూ? తప్పదన్నాడు. నాకు బయలుదేరక తప్పలేదు. వేషం మార్చి వీధిలో పోతున్న ఆటోరిక్షాని నిలిపి దాని మీద బైఠాయించాను.

"ఎక్కడికి, సార్?"

"మెస్సర్స్ చంద్రారావు & బ్రదర్స్"

చంద్రరావు నా మిత్రులలో ముఖ్యుడు. అంగులోనూ మేం క్లాస్ మేట్స్ం కూడా. ధనవంతుడి కొడుకైనమూలాన అతన్ని ముఖ్య స్నేహితుడిగా ఎంచుకున్నవాళ్లు చాలామంది వుండేవారు. వాళ్లల్లో అతను ముఖ్య స్నేహితుడిగా ఎంచుకున్నవాడ్ని నేనే!

అసలు మొదటి రోజుల్లో అతను నన్ను నిర్లక్ష్యం చేసేవాడు. ముఖస్తుతి, పరనింద నాకు చాతకావు. పొగడ్తరాయుళ్ళందర్నీ నమ్మి, వాళ్ల కోతలకి మోసపోయి, ఆర్థికంగా చాలా చిక్కులు పడేవాడు, విద్యార్థి దశలో. చివరి రోజుల్లో నా స్నేహాన్ని పట్టాడు. నా కష్టాల్ని కొన్నిటిని గమనించి ఆర్థికంగా ఆదుకోబోతుంటే నే చేసిన ప్రతిఘటనే అతనికి నామీదగల సదభిప్రాయాన్ని బలపర్చడానికి తోడ్పడింది.

అంగడి ఎదుటే నాకు స్వాగతమిచ్చాడు.

కులాసా కబుర్లు అయ్యాక: "అసలు పెళ్లి చేసుకోననేవాడివిగా" అన్నాను, అసలు విషయాన్ని కెలకాలని.

"అన్నమాట నిజమే కాని పరిస్థితులు మారాయి" చిన్నగా నవ్వాడు.

ఆ నవ్వులో నా కేదో అనుమానం తోచింది. కాని దాన్ని మొహంమీద చదవలేకపోయాను.

"ఎన్నింటికి వెళ్లడం?"

"పదిన్నరకి."

కాసేపు ఎవరో వ్యాపారంమీద వొస్తే, నన్ను వొంటరిగా వొదిలి వెళ్లాడు.

చంద్రారావు గత చరిత్ర నా కళ్లముందు తిరిగింది. తండ్రి గొప్ప వ్యాపారస్తుడే కాని చివరి రోజుల్లో కొంత దెబ్బతిన్నాడు. చంద్రారావు అప్పుడే చదువుమాని వ్యాపారాన్ని చేబట్టాడు. అప్పట్నించీ అతను పట్టింది బంగారమవుతోంది. అతనికి గొప్ప వ్యాపారస్తుడని అనతి కాలంలో ఎంతో పేరు ప్రఖ్యాతులు కలిగాయి. చాలా ధనవంతుడయ్యాడు.

కాంతి కృష్ణమూర్తి

కాని పెళ్ళిమాత్రం ఇంతవరకూ చేసుకోలేదు. కారణం తెలీదు.

కష్టాలున్నవాళ్లకి కష్టాలూ, ధనం వున్నవాళ్లకి ధనం రావటం ప్రపంచంలో జరిగే వింతల్లో ఒకటి.

అతను తిరిగి రావడంతో నా ఆలోచనలు కరిగిపోయాయి

## 2

అనుకున్న ముహూర్తానికి పెళ్ళిచూపులకి వెళ్ళాం.

పెళ్లిచూపులు ఘనంగా జరిగాయి. వాళ్ల ఏర్పాట్లు నన్ను ఆశ్చర్యచకితుణ్ణి చేశాయి. వాళ్ళూ లక్షాధికారులే! అందుకని ఏర్పాట్లు చిన్న పెళ్లికి చేసినట్లుగా చేశారు.

చంద్రారావు అంతసేపూ చాలా స్థిరచిత్తంతోనే వున్నాడు.

పెళ్లికూతుర్ని మాత్రం చూడడానికి అసహ్యం కలిగింది. జీడిరంగును పోలివుంది. ఆకస్మికంగా చూసినవాళ్లు, ఏ బొగ్గుగనిలోనో పనిచేసివచ్చి పొరపాటున మొహం చేతులూ కడుక్కోలేదు గావు ననుకుంటారు. అంత అనాకారిగావుంది.

కారులో తిరిగి వచ్చేటప్పుడు చంద్రారావు చెప్పాడు. వాళ్లకి ఒక్కతే కూతురట! ఆయన లక్షాధికారిట! 20 వేలు కట్నం, 100 ఎకరాలు మాగాణి అల్లుడికిస్తానన్నాడుట. అదీకాక మామ అనంతరం అతనికే ఆస్థిపై సర్వాధికారం లభిస్తుంది - ఈలోపల అసంభవమైన కుమార సంభవం ఏదైనా జరిగితే వేరేమాట.

"నీకు పిల్ల నచ్చిందా?" అన్నాను.

"దానికేం? అదంత ముఖ్యమైన విషయం కాదులే" అని దప్పరించాడు.

నే నింకేం మాట్లాడలేకపోయాను.

## 3

చంద్రారావు పెళ్ళి చాలా ఘనంగా జరిగింది. అనుకున్న లాంఛనాలన్నీ సవ్యంగానే జరిగాయి.

వాళ్ల దంపతుల ఫోటోలు పత్రికల్లో పడ్డాయి.

అతని పెళ్లికి దేశం నలుమూలలనుండి గొప్పవాళ్లంతా సందేశాలూ, కానుకలూ పంపారు.

చంద్రారావు అత్తారు అతనికంటే ఎన్నోరెట్లు ధనవంతులని వొప్పుకోక తప్పదు.

## 4

అతనికి బావమరిది కలిగాడనే వార్త వ్యాపారంలో అతని గొప్ప శత్రువులూ, బంధుత్వరీత్యా గొప్ప చుట్టాలూ అయిన వారికందరికీ అమితమైన ఆనందాన్ని చేకూర్చింది.

ఆ వార్తకు నా మనస్సూ చలించక పోలేదు.

ఓ నెల్లాళ్ళు పోయాక తీరుబడి చేసుకుని అతనింటికి వెళ్ళాను

చంద్రారావు మామూలుగా మందహాసం చేస్తూ కన్పడ్డాడు. అతనిలో ఏవిధమైన ఆందోళన గాని కన్పడలేదు.

హైదరాబాద్ స్వీట్లూ, బొంబే హల్వా, బిస్కట్లూ అన్నీ పెట్టి, తినమని బలవంత పర్చాడు. అన్నీ రుచి చూసేటప్పటికే కడుపు నిండినట్టయింది.

ఆ మాటా ఈ మాటా అయ్యాక నేనే కదిపాను.

"నీ మామగారికి కొడుకు కలిగాడుటగా"

"అవును"

"నీకు నష్టమేనే, పాపం"

 ఇది వ్యాపారమే! 

"నేనేం వాళ్ల ఆస్తిని ఆశిస్తేగా సానుభూతి చూపడానికి?"

"నిజంగా ఆ అమ్మాయిచేత ఆకర్షింపబడే పెళ్ళాడావా?"

"కాదు!"

"మరి?"

"అంతా వుందిలే!"

"నాదగ్గరా రహస్యమేనా?"

"రహస్యం కాదు. కొన్నాళ్లల్లో నీకే తెలుస్తుంది."

**5**

కొన్నాళ్ళల్లో నేను ఆ వూరు విడిచాను.

(49-వ పేజీ చూడండి)




# పసి బావాలు

వేజెండ్ల సాంబశివరావు

చిన్ననాటి నా చేష్టలు
ఎన్నదగిన కథలెన్నో
ముసలి తాత వివరించగ
ముసురుకొన్నదమ్మ సిగ్గు —

పున్నమి వెన్నెల చిలికిన
వెన్నెలరాజుని చూచి
అమ్మా! వెన్నెల రాజును
ఇమ్మాయని ఏడ్చానట —

అయ్యవారి వద్ద కెళ్ళి
'అ ఆ'లను దిద్దమంటె
కుక్కపిల్ల నేర్పునటే
చక్కని చదువన్నానట —

సంబరాల సంక్రాంతికి
సరదాగా బావ రాగ
కోతిబావ వచ్చాడని
కొక్కిరించినానట —

పండుగ మరునాడు బావ
ఇంటికి పయనంబు కాగ
ఒక్క దొంగ తుమ్ము తుమ్మి
అక్క మొగము చూచానట —

చిత్రమైన రంగులతో
చిత్రమొకటి నాన్న గీయ
నాన్న లేని సమయమందు
నల్లరంగు చిలికానట —

అల్లరి చిల్లరి పనులు
అన్ని నేను చేసివైచి
అన్నపైన చాడీలను
నాన్న కెన్నొ చెప్పానట —

నా చేష్టలు అన్ని తెలిసి
నాన్న కన్ను లెఱ్ఱచేయ
తాతయ్యను కౌగలించి
వింత మొగము వేశానట —




# చీమ - కుమ్మరి పురుగు

పల్లెటూళ్ళ
పట్టణముల
జనపదముల,
వనపథముల,
ఇచటచటని
ఎన్ననేల ?—
నేల నాల్గు
మూలలందు
చైత్రమాస
చిత్ర శోభ

కొల్లలుగా
వెల్లివిరిసె.
అంత సకల
జంతుకోటి
ఆట పాట
లందు మునిగి
కాలమెల్ల
గడుపసాగె.

చీమ యొకటె
ఈ మహోత్స

వానికి దూ
రాన నుండె
ఒంటరిగా
ఓపికతో
తిరిగి తిరిగి
తిండి గింజ
లేరి ఏరి
చేరవేసె
తిన్నగ తన
కన్నమునకు.

చీమతీరు
సోమరియగు
కుమ్మరి పురు
గొకటి చూచి,
హిహీ యని
ఇకిలించెను!

"వెర్రి చీమా!
వెర్రి చీమా!



ఈసప్ కథలు 5: నండూరి రామమోహనరావు

అందరు ఆ
నందముతో
వేడుకగా
ఆడుచుండ
మూపు పైన
మూటలతో
పాటు పడెద
వేటి కిట్లు ?
వెర్రి చీమ !
వెర్రి చీమ !"



చీమ జవా
బే మివ్వక
తన పనిపై
తా నేగెను.

* * *

వర్షఋతువు
వచ్చెనంత
కుంభవృష్టి
కురిసెనంత.
గడగడ చలి
వడకించెను.
గట్లు తెగెను.
చెట్లు పడెను.
చెత్త పోగు
చెదరి పడెను.

వచ్చెనంత
వర్షఋతువు.
మండిపోయె
తిండి కరువు.

తిండికొరకు
తిరిగి తిరిగి
కుమ్మరి పురు
గుమ్మలించి,
పొట్ట చేత
పట్టుకొనుచు,
చీమ యింటి
చెంతకేగి,

"మంచి చీమ !
మంచి చీమ !
ఆకలితో
అలమటించు



మిత్రునకొక
మెతుకు పెట్టి
కనికరమున
గావుమమ్మ !"
అని ఎంతో
అర్థించెను.

అంత చీమ
అన్న దిట్లు :
"ఆ దినమున
ఆడినట్టి
మాటలన్ని
మరచితివా ?
ఆ రోజున
అందలమున
ఊరేగితి
వీ రోజున
తిరిపెమునకు
తిరుగుచుంటి
వెందులకో
ఎరుగుదువా ?

వసంతఋతు
వసంతమని
ఆ దినమున
అనుకొంటివి.

వర్షఋతువు
వచ్చుననెడి
ఆలోచన
మే లేకను
ఇడుమలిపుడు
పడుచుంటివి.
నేను చూడు
మా నాడే
కూడ బెట్టు
కొనుట వలన
ఏ కష్టము
లేక యిపుడు
ఆనందము
గా నుంటిని.

శ్రమకు సమా
నములేదని,
శ్రమజీవుల
శ్రమ ఫలముగ
అంగారము
బంగారై,
లోకమ్మే
నాకమ్మై
నందనమటు
లందగించు
నంచు తెలియు
మయ్యా నీవు"

అని తన క
ష్టార్జితమున
కొంత తీసి
కుడువబెట్టె.




## 10

షావలిన్ కటువుగా చెప్పిన సమాధానంతో మార్గరెట్ కుంగిపోయింది.

"షావలిన్ ! ఏమి జరిగిందో తెలుసుకోవాలని నాకు చాలా ఆదుర్దాగా ఉన్నది. తిన్నగా చెప్పకూడదూ ?" అని ప్రాధేయపడింది.

"సరిగ్గా ఒంటిగంటకు భోజనశాలలో నే నొకమూల, సర్ పెర్సీ ఒకమూల, చెరొకసోఫామీద చేరి హాయిగా నిద్రపోయినాము."

"అంతేనా? ఎవ్వరూ రానే లేదా అయితే?"

"ఒక్కడు !"

"అయితే మనము చేసిన ఇంత ప్రయత్నమూ బూడిదలో పోసిన పన్నీరేనా! అంతా వ్యర్థమైపోయిందన్న మాటే?"

"ఆఁ! అన్నమాటే !"

"మరి ఆర్మండ్ మాట..." అని జంకుతూ జంకుతూ అన్నది మార్గరెట్.

"షావలిన్ ఆమెవైపు తీక్షణంగా చూశాడు. "ఆర్మండ్ ? ఆర్మండును రాజాలాంటి తాడుతో ఉరి తీస్తారు. దేవుడు మేలుచేసి మధ్యలో అది తెగిపోకుండా ఉండాలే కాని!"

మార్గరెట్ నిలువునా వణికిపోయింది. కంట తడి పెట్టింది. "అదేమిమాట షావలిన్? నీకోసం నేను ఎంత అవస్థపడ్డాను? నీవు చెప్పినదానిలో ఒక్కముక్క జారిపోకుండా చేశాను, నాచేతనైన సహాయం శక్తివంచన లేకుండా చేశాను."

"నీవు చెయ్యలేదని ఎవడన్నాడు? మార్గరెట్! ఇప్పటికయినా మించిపోయిందేమీ లేదు. తెల్లవారితే పింపర్నల్ ఫ్రాన్సు పోతాడని చెప్పావుగా! చూస్తాను. నీ అదృష్టం బాగుంటే, పింపర్నల్, నేను ఫ్రాన్సు బయలుదేరటం పడితే, మీ ఆర్మండ్ వ్రాసిన ఉత్తరం నీకు పంపించేస్తాను అక్కడ పింపర్నల్‌కు సంకెళ్లుపడే వేళకి నీ అన్న ఇక్కడ నీ కళ్లముందు ఉంటాడు. లేదూ?..."

"ఒకవిధంగా జరిగితే బాగుండు ననిపిస్తున్నది." అన్నది.

"ఏమిటది?"

"నీవంటి కసాయివాడితో ఆ యమధర్మరాజుకు అవసరం రాకపోతుందా? తెల్లవారే లోగా నిన్ను తీసుకుపోతే బాగుండును."

షావలిన్ ఆమె మాటలు లక్ష్యపెట్టకుండా, విరసంగా నవ్వాడు "యమధర్మరాజుకు పనికివచ్చే పాటి శక్తిసామర్థ్యాలు నాకు ఉన్నాయంటావు. మంచిదే" అన్నాడు.

మార్గరెట్ ఇక మాట్లాడలేదు. ఎదురుగా కోచి సిద్ధంగా ఉన్నది. గుఱ్ఱాలను బలవంతంగా నిలిపి పట్టుకున్నాడు సర్ పెర్సీ. తలవంచుకొని వెళ్లి కోచి ఎక్కింది. బయలుదేరుతూఉండగా, జాలిగా షావలిన్‌వంక చూసింది, "నన్నేమి చేయమంటావు?" అన్నట్లు బుజాలు ఎగురవేసి, చేతులు నలుపుకొన్నాడు షావలిన్.

## 11

గుఱ్ఱాలు నురగలు కక్కేటట్లు జోరుగా తోలటం

పెర్సీకి మహాసరదా. కోచి లండన్ వీధులలోగుండా దూసుకొని పోతున్నది. మార్గరెట్ సర్ పెర్సీ ప్రక్కన కూర్చున్నది. యథాప్రకారం ఇద్దరూ ఒకరినొకరు పలకరించుకోకుండా కూర్చున్నారు.

సర్ పెర్సీ భవనం రిచ్‌మండ్‌లో ఉన్నది. లండన్‌నుండి రిచ్‌మండుకు గంటప్రయాణం. విందులు, నృత్యాలు ఉన్నంతసేపు మాత్రమే సర్ పెర్సీ లండన్‌లో ఉంటాడు. అవి ముగిసినతరువాత రాత్రి ఎంత ప్రొద్దుపోయినా సరే, లండన్ సందడికి దూరంగా ఉన్న రిచ్‌మండ్ చేరుకోవలసిందే. సర్ పెర్సీలోఉన్న ఈ సద్గుణానికి ఆ మార్గరెట్ ఎంతో సంతోషిస్తూ ఉంటుంది.

మసక వెన్నెల వెలుగులో ఆమె అతని ముఖం వంక చూసింది. అరమూసిన ఒక కన్ను, వంపుతిరిగిన గడ్డం, ముఖం ఒక పార్శ్వభాగంమాత్రం కనిపిస్తున్నది. ఆ విధంగా అతనిని చూస్తుంటే మార్గరెట్‌కు వెనుకటి రోజులన్నీ గుర్తువచ్చినాయి. వరికోరి తామిద్దరూ వివాహంచేసుకోవటం ఆమె మనస్సులో మెదిలింది. పెర్సీ ఎంతమంచి హృదయం కలవాడు ! తానంటే ఎంతప్రేమగా ఉండేవాడు ?

పెర్సీమీద ఆమెకు ప్రేమ ముంచుకువచ్చింది. అతడు మందమతి కాకుండా ఉంటే ఎంత బాగుండి ఉండేది ! పాపం ! ఆ తల్లి పిచ్చిదికాబట్టికదా ఈ గతి పట్టింది పెర్సీకి !

షావలిన్ తన పీకమీదకు తెచ్చిన వత్తిడివలన పింపర్నల్ ఆచూకీ తీయడానికి తాను చేసిన ప్రయత్నం సంగతి అంతా కనుక చెపితే పెర్సీ ఏమనుకుంటాడు ? అతనికి తెలియకుండా, తనలా చేయటం ఎంత తప్పు ? అనుకొని పశ్చాత్తాపపడింది.

ఇంతలోనే మార్క్విస్‌డి సెంట్‌కర్ వృత్తాంతం ఆమె మనసులో మెదిలింది. అనాలోచితంగా తొందరపడి నోరుజారినందువలన ఒక కుటుంబంలోని యావత్తు మంది చావుకు తాను కారణంకావటం, ఆ పాపం తన నెత్తికి చుట్టుకోవటం జరిగింది. ఇప్పుడు మళ్ళీ అలాగే స్కార్లెట్ పింపర్నల్‌కు ద్రోహంచేసి, ఆ పాపానికి ఒడిగట్టింది.

మార్క్విస్ డిసెంట్‌కర్ వృత్తాంతం విన్నప్పటినుండి, పెర్సీ ఆమెను అసహ్యించుకోవటం మొదలుపెట్టాడు. వీలయినంతవరకు దూరదూరంగా తప్పించుకొని తిరుగుతున్నాడు. ఎంత మందమతి అయినా పెర్సీది జాలిగుండె. ఇతరులకు వచ్చిన కష్టం తనదిగా భావించుకుంటాడు. పింపర్నల్‌ను షావలిన్‌కు పట్టి ఇవ్వటానికి తాను తోడ్పడిన సంగతి తెలిస్తే, మళ్ళీ తనముఖం చూస్తాడా?

సర్ పెర్సీభవనంప్రక్కనే వాగున్నది. మూడుపక్కల పండ్లతోటలున్నాయి. రాజభవనం కూడా అంతవైభవంగా ఉండదేమో అనిపిస్తుంటుంది.

కోచి వంతెనమీదుగా వాగుదాటింది. తోటల మధ్యఉన్న బాటవెంబడి ఆవరణలోకి ప్రవేశించింది. భవనంముందుఉన్న పోర్టికోలో ఆగింది. ద్వారానికి ఎదురుగా ఒక్క అంగుళమైన ముందువెనుకలు లేకుండా కోచి నిలిపాడు సర్ పెర్సీ.

కోచి ఆగగానే పెర్సీముందు, దూకి మార్గరెట్ దిగటానికి చెయ్యి అందించాడు. యజమానిరాకకోసం ఎదురుచూస్తున్న పరిచారకులు సంభ్రమంతో సమీపించి చేతులు కట్టుకు నిలబడ్డారు. ఎవరు చేయవలసిన పని వారికి చెప్పాడు పెర్సీ.

మార్గరెట్ మనసు ఇంకా ఆందోళనగానే ఉన్నది. అందుచేత ఆమెకు వెంటనే లోపలికి పోబుద్ధి కాలేదు. పోర్టికో దాటి తానుపయోగించే గదుల ముందు ఉన్న పచ్చికపట్టుమీదికి వెళ్ళింది. ఏదో దీర్ఘంగా యోజనచేస్తూ నిలబడింది.

దూరంగా ఉన్నవాగు నీరు జలజలమని చేస్తున్న ధ్వని సన్నగా వినిపిస్తున్నది. తోటలో ఆకు రాలినా సవ్వడి వినిపిస్తున్నది. కోచిగుఱ్ఱాలను విప్పి పరిచారకులు లాయములకు తీసుకువెళ్ళారు. మార్గరెట్ అలాగే నిలబడి, మునుపటికిమల్లే మనశ్శాంతి, సౌఖ్యమూ ఈ జన్మలో మళ్ళీ కలుగుతాయా అనుకున్నది. కొంతసేపటికి ఆలోచనలలోనుండి తెప్పరిల్లుకొని మార్గరెట్ తన పడకగదికి బయలుదేరింది.

పోర్టికోఅవతల ప్రక్కమెట్లమీద ఇంతలో అడుగుల సవ్వడి వినిపించింది. ఆమె తలఎత్తి చూసింది. సర్ పెర్సీకూడా ఎందుచేతనో ఇంకా నిద్రపోలేదు. దుస్తులైనా మార్చుకోకుండా, వెన్నెలలో అటుఇటు తిరిగి వస్తున్నాడు. పెర్సీ మార్గరెట్‌ను చూడలేదు. పొడుగాటి తన శాటిన్‌కోటుజేబులలో చేతులు పెట్టుకొని, పై మెట్టుమీద ఒకకాలుపెట్టి, అటుతిరిగి నిలబడ్డాడు.

మార్గరెట్ అతనిని పిలుస్తూ దగ్గరకు పోయి నిలబడింది

"వెన్నెల ఎంత బాగుందో చూశావా?" అని అడిగింది. "అవును" అంటూ పెర్సీ లోపలికి పోవటానికి సిద్ధపడ్డాడు.

"పెర్సీ! ఇంత బాగున్న వెన్నెలలో ఇలాగే కొంతసేపు కూర్చొని కులాసాగా కాలంగడపాలనిపించ టంలేదా?" అంటూ ఆమె అతనిని ఆపింది. పెర్సీ కొంచెం తటపటాయించాడు.

"పెర్సీ! నేనంటే నీకు ఇంతకోపం అసహ్యం ఎందుకు?" అని ప్రతిమాలుకుంటున్నట్లు అడిగింది.

ఏమాత్రం తొణకకుండా "కోపం ఏముంది మార్గరెట్?" అన్నాడు పెర్సీ. కాని మెట్లమీద నిల బడ్డట్లు ఉన్నాడు.

"ఇలాంటి కబుర్లతో నన్ను మరిపించాలని చూడకు. ఇదివరకుమల్లే నీవు నన్ను ప్రేమతో చూస్తున్నావా?"

"చాలా తమాషాగా మాట్లాడుతున్నావేమిటి ఇవ్వాళ? ఏం జరిగింది?" అన్నాడు పెర్సీ. "నేనే దీని కంతా కారణమైనట్లు మాట్లాడుతున్నావే! నిజానికి నేనేం చేశాను? నీవు ఛీ అని నన్ను విదిలిస్తున్నా వెంట బడి తిరగలేదు. అంతేనా నేను చేసిన తప్పు?"

వణుకుతున్న కంఠంతో మార్గరెట్ ఇలా అన్నది. "నేనే? నిన్ను ఛీ అని విదిలించానా? ఎప్పుడు."

"నేను కొంచెం మందమతిని. జ్ఞాపకశక్తి నాకు తక్కువ. అందువలన నేను పొరపాటుపడుతున్నా నేమో. పెధవది! ఇంత బతుకుబతికి ఇదికూడా మరిచి పోయిఉంటానా? ఆనాడు మన వివాహమయిననాడు, ఇంకా యిరవైనాలుగు గంటలైనా కాకముందే పారిస్‌లో మార్క్విస్ డిసెంట్‌కర్‌ను సకుటుంబంగా గిల టైన్‌కు పంపించారు అవునా? దానికంతటికీ కారణం సర్ పెర్సీగారి సతీమణే అని వారూ వీరూ అందరూ అనుకుంటూ ఉండగా వెధవది నా చెవిని బడింది. నేను నీ దగ్గరకు వచ్చి, ఏమిటిది? నేను విన్నది నిజమేనా? అని అడిగాను. అప్పుడు నీవేమి చేశావు? గుర్తుందా?"

"అవును. వారూ వీరూ చెప్పినమాటలలో ఉన్నంత నమ్మకం నీకు నామీద లేదు."

"ఇది బాగుంది. నమ్మకమేమిటి? జరిగినదేమిటో నీవు అడిగినా చెప్పకపోతివి. అందరూ చెప్పుకుంటు న్నది విని, అక్కడికీ నమ్మకం కుదరకనేగదా నిన్ను అడిగాను!"

"పోనీ! అప్పుడేదో తొందరలో చిరాకులో అలా విదిలించేశానే అనుకో. అంతమాత్రాన మన బ్రతుకులు ఇలా వెళ్ళిపోవలసిందేనా? నీకు నేను, నాకు నీవు దూరమైపోవలసిందేనా?

ఆర్మండ్ అంటే నాకు ఎంత ప్రాణమో నీకు తెలుసు. అటువంటి ఆర్మండ్‌ను మార్క్విస్ ప్రాణాలు కడబట్టేదాకా చావ చితకగొట్టించాడు. ఆర్మండ్ చేసిన మహాపరాధమేమిటో తెలుసునా? ఆ ప్రభువు కూతురువంక కన్నెత్తిచూడటం. అంతే దానితో నాకు వళ్ళు మండిపోయింది. ఏమయినాసరే దెబ్బకి దెబ్బ తీయాలనుకున్నాను. ఆ తరువాత ఎప్పుడో ఒక అవ కాశం దొరికింది. పారిస్‌లోఉన్న విప్లవ ప్రభుత్వానికి వ్యతిరేకంగా, మార్క్విస్ డిసెంట్‌కర్ ఆస్ట్రియా ప్రభుత్వంతో చేయికలిపి రహస్యంగా కుట్రలు పన్ను తున్నాడని నాకు తెలిసింది.

ఇంతపని జరుగుతుందని నేను అనుకోలేదు. తెలిసిఉంటే, నేను ఎవ్వరికీ చెప్పేదానినే కాను. ప్రక్కవారితో మాట్లాడుతూ ఒకనాడు నేను మాట వరసకి ఈ విషయం నోరుజారాను. వారు ఇదొక పెద్ద రాజకీయపు వ్యవహారం చేశారు. వ్యవహారం నా చేయిదాటిపోయిందని తెలుసుకున్నాను. నే నొక గొప్ప దేశసేవకురాలినని ప్రజలు జేజేలు కొట్టారు కాని నేనో కుమిలి కుమిలి ఏడ్చాను.

కొందరు నేను కరినాత్మురాలినని దుర్మార్గు రాలినని దూషించారు. నీవుకూడ ఆఖరుకు, నన్ను అర్థంచేసుకోకుండా, వారితో కలిశావు. ఆ ఉద్రేకంలో ఏమి చేస్తున్నానో కూడా తెలియకుండా నిన్ను విదిలించేసి, మాటలన్నాను. ఇదే నా తప్పు. ఈ నేరం క్షమించరానిదే నంటావా పెర్సీ?"

మార్గరెట్ వెలిబుచ్చిన ఆవేదనతో పెర్సీ మనసు కరిగింది. కాని బయటపడలేదు.

"అవునుగాని, ఇప్పు డిదంతా ఎందుకు బయ టకు వచ్చింది. నీవు ఎలాగైనా అదొకరీతిగా ఉన్నావు ఎందుచేత?" అని ప్రశ్నించాడు పెర్సీ.

అనుకోకుండా చెర్రీ తన పై సానుభూతి చూపుతుండటంతో మార్గరెట్ కు దుఃఖం ఆగలేదు. వెక్కుతూ "నీవు చాలా చిక్కులలో వున్నావు" అన్నది.

"అలా భయపడతావేం, ఆఫీసులో చెప్పు రాదూ?"

"అంత విరుగుతుంటే ఎలా చెర్రీ అర్థమౌతుంది నాకు ఎంత ప్రాణమో, నీకూ అంతేగదా! అర్థమౌత్

---

ఇప్పుడు మహోగ్రరూపంలో వచ్చాడు. తెలివి తక్కువగా, ఆలోచించకుండా అతడు సర్ ఆండ్రూకు వ్రాసిన ఒక ఉత్తరం షావలిన్ చేతికి చిక్కింది. పెర్సీ! ఆర్మండ్ మీద దేశద్రోహంనేరం మోపుతారు. ఇవ్వాళో, రేపో పట్టుకొని అరెస్టు చేస్తారు. ఉరి తీస్తారు." అంటూ మార్గరెట్ ఏడుపు మొదలు పెట్టింది.

ఈ సంగతి వినగానే పెర్సీ ఒక క్షణంసేపు కలవరపడ్డాడు. కాని వెంటనే సర్దుకొని, "బాగుంది, విప్లవం కథా కమామీషు చాలాదాకా వచ్చిందన్నమాట. నిప్పు ఆశ్రయం ఇచ్చిన కట్టెనే నామరూపాలు లేకుండా చేస్తుంది. ఆ సామెతకు దిగింది విప్లవం. వెధవది!" అన్నాడు కటువుగా, వ్యంగ్యంగా.

"ఆర్మండును రక్షించటానికి ఏదయినా ఉపాయం చూడవా పెర్సీ?"

"చూడకేం. అన్నట్లు షావలిన్ ఉన్నాడుగా. అతను ఎంత చెప్తే అంత ఆ విప్లవ ప్రభుత్వం. అతని నీవు బాగా ఎరుగుదువుగా? చెప్పిచూస్తే..."

"చెప్పాను. కాని అతడు నాకు ఇంకో కంత వత్తిడి తెచ్చిపెట్టాడు..." అని ఊరుకున్నది మార్గరెట్. ఆ తరువాత విషయం పెర్సీతో చెప్పటానికి ఆమెకు ముఖం చెల్లలేదు. పెర్సీకూడా అదేమిటో చెప్పమని పట్టుపట్టలేదు.

"సరేలే! ఆర్మండుకు మరేమీ భయంలేదు. దాని విషయమేమిటో నేను చూస్తానుగా! వెధవది! ఇంత బతుకు బతికి ఈమాత్రం చెయ్యలేనూ?" అంటూ పెర్సీ ఆమెను భవనంలోకి సాగనంపాడు.

మార్గరెట్ లోపలికి వచ్చి అద్దం చూసుకున్నది. చెక్కిళ్ళమీద కన్నీరు చారికలు కట్టింది. పెర్సీ ఇచ్చిన ఆసరాతో ఆమెమనస్సు కాస్త కలకతీరింది. ఇన్నాళ్ళ తరువాత భర్తతో మనసు విప్పి మాట్లాడటంవలన భారం తీరి తేలికన పడింది.

గదికిటికీలు తెరిచిపెట్టి, మార్గరెట్ ప్రక్కమీదికి చేరింది. చల్లటి గాలికి ముంగురులు కదిలి నుదుటిమీద ఆడుతున్నాయి. కిటికీలోనుండి లోపల ప్రక్కమీదకు వెన్నెల వెలుగు పడుతున్నది. మార్గరెట్‌కు నిద్రపట్టింది. నిద్రలో ఆమె దేవకన్యకలాగా మెరిసిపోయింది.

## 12

మార్గరెట్‌కు మంచి నిద్ర పట్టింది. మళ్ళీ ఆమెకు మెలకువవచ్చి కనులు తెరిచి చూచేసరికి,

తెల్లవారింది. ఇంతలో ఆమెకు గదిబయట అడుగుల చప్పుడి వినిపించింది. ఎవరో గది తలుపులదాకా వచ్చి, తిరిగి వెళ్ళిపోతున్నారు. ఎవరైఉంటారా అను కుంటూ మార్గరెట్ తలుపువద్దకు వెళ్లి తీసింది. ఎవ్వరూ కనిపించలేదు.

తలుపుదగ్గర క్రింద ఒక కాగితంమాత్రం పడి ఉన్నది. వంగి తీయబోయింది కాని ధైర్యం చాల లేదు. ఆ కాగితంతీస్తే, అందులో ఏమి ఉంటుందో అనుకుని కీడు శంకించింది చివరకు ఎలాగో ధైర్యం తెచ్చుకొని తీసి చూసింది. అది పెర్సీ వ్రాసిన ఉత్తరం. పెర్సీని తాను కొద్దిగంటల ముందే కలుసు కున్నది. అప్పుడు చెప్పటానికి లేని సంగతులు ఇంతలో ఏమి ఉంటాయి అని విస్తుపోతూ, చదివింది.

"చాలా జరూరు పని ఒకటి తగలటంచేత అను కోకుండా ఉత్తరమండలానికి బయలుదేరవలసి వచ్చింది నిద్రపోతున్నావుకదా లేపటం ఎందుకని ఈ ఉత్తరం వ్రాస్తున్నాను. వచ్చే బుధవారంనాడు నీవు ఏర్పాటుచేసిన విందుకు అందుకోవటం పడదు. మరేమీ అనుకోకు."

పెర్సీ బ్లాకనీ.

సర్ పెర్సీకి ఉత్తరమండలంలో కొంచెము భూమి పుట్ర ఉన్నది. అప్పుడప్పుడు ఎప్పుడయినా అక్కడికి వెళ్ళటం, ఒక వారం పదిరోజులపాటు ఉండి రావటం పరిపాటిగా ఉన్నదే. కొత్త ఏమీ లేదు. కాని ప్రత్యేకంగా ఈనాడు, తనకు అన్నీ చిక్కులే వస్తున్నరోజున, ప్రతిదీ ప్రాణాంతకమైన సమస్యగా పరిణమిస్తున్నరోజున, తనను విడిచిపెట్టి, తన కళ్ళ ఎదుట లేకుండా సర్ పెర్సీ పోవటం ఆమెకు బొత్తిగా ఇష్టంలేకపోయింది. అయినా ఇంత హడావిడిగా పరు గెత్తుకు పోవలసిన అవసరం ఏమిటో ఆమెకు బోధపడ లేదు. సంగతి ఏమిటో తెలుసుకుందామనే ఉద్దే శ్యంతో ఆమె పోర్టికోవద్దకు పరుగెత్తుకుపోయింది.

అక్కడ రెండు గుఱ్ఱాలు జీనువేసి, సిద్ధంగా ఉన్నాయి. అందులో ఒకటి 'సుల్తాన్' - పెర్సీకి అత్యంత ప్రియమైనది.

గుఱ్ఱపుస్వారికి అనువైన దుస్తులతో సర్ పెర్సీ అక్కడికి వచ్చాడు.

"పెర్సీ! ఈ ప్రయాణమేమిటి?" అని అడిగింది మార్గరెట్.

"చెప్పానుగదూ! ఉత్తరమండలానికని."

"అంత అవసరమా?"

"చాలా! వెధవది! వెళ్ళక తప్పదు."

"మళ్ళీ రావటం ఎప్పుడు? నాలుగైదు రోజు లతో..."

"ఏమోఁ చెప్పలేను. ఇంకా ఎక్కువే పట్ట వచ్చు." అంటూ పెర్సీ బయలుదేరటానికి తొందర పడ్డాడు. మార్గరెట్ అనవసరంగా ఆపి, జాగుచేస్తు న్నందుకు ముఖంలో చిరాకు కనబరిచాడు.

"పెర్సీ! నీ ప్రయాణం ఇవాళే ఎందుకు వచ్చింది? చెప్పవూ? ఆమాత్రం తెలుసుకునే హక్కు నాకు లేదా? ఉత్తరానికి నీవు వెళ్ళటం లేదని నాకు తెలుసు. అక్కడినుంచి రమ్మని ఉత్తరాలుగాని, మనిషి గాని రానేలేదు."

"ఇదుగో మార్గరెట్! నేను పనిలేకుండా పోవటంలేదు. ఆర్మండ్ కోసం పోతున్నాను. ఆర్మండ్ సంగతి కనుక్కోవాలికదా మరి."

"అవును. కాని నీవు తొందరపడి ఏమీ అఘా యిత్యం చెయ్యవుకదా!"

"చెయ్యను. నాకు తెలిసినవారు కొందరు ఉన్నారు. వారిని కలుసుకుంటే తేలికగా పని అవు తుంది. ఆలస్యం అయిపోతున్నది. పోయిరానా?"

పెర్సీ గబగబవెళ్ళి సుల్తాన్‌ను అధిరోహిం చాడు. రెండవ గుఱ్ఱంమీద వెనుక పరిచారకుడు బయలుదేరాడు. గేటుదాటి రోడ్డు ఎక్కించారు.

యజమాని మనస్సులో ఉన్న తొందరను గమ నించి, సుల్తాన్ వాయువేగంతో పోసాగింది. రోడ్డు మలుపు తిరిగి ఆశ్వికులు మార్గరెట్ దృష్టిపథంనుండి మాయమైనారు.

మార్గరెట్ మనస్సు పూర్తిగా స్తిమితపడింది. దీనితో అన్ని చిక్కులు పరిష్కారమైనట్లే భావించింది. ఆర్మండును కాపాడటానికి పెర్సీ పూనుకున్నాడు కాబట్టి భయంలేదు. ఇక షావలిన్ పాపం ఒంటిగంటకు భోజన శాలకు చేరి ఎంత కాపలాకాసినాపింపర్నల్ రానే లేదు. కనుక పింపర్నల్ షావలిన్ వలలో పడడు.

పెర్సీ అంటే ఆమెకు భయభక్తులు, గౌరవాభి మానాలు ఇనుమడించినాయి. పెర్సీని తలచుకొంటూ మార్గరెట్ మళ్ళీ వెళ్ళి పడుకున్నది. కమ్మగా నిద్ర పోయింది

(ఇంకా వుంది)

# గాజుల బేరం

ఆంధ్రదేశంలో ప్రకృతి సౌందర్యానికి - పాడిపంటలకు - నిలయమని ప్రఖ్యాతిగాంచి, గోదావరి ముఖాన్ని ఆనుకునివున్న సీమలో - ముంగండ అగ్రహారము అని ఒక గ్రామం వుంది.

ఆ గ్రామం పుట్టి యిప్పటికి సుమారు ఐదువందల సంవత్సరాల క్రితం అని పెద్దలు చెబుతారు. అటువంటి పురాతన గ్రామంలో రెండువందల సంవత్సరాల క్రితం ఒక విచిత్రగాథ జరిగిందని చెబుతారు.

వేదపండితులైన శాస్త్రిగారొకరు ఆ అగ్రహారంలో వుంటూండేవారు. వీరిని ఆ రోజులలో

సవాలు చేయగలిగినవారు ఎవరూ లేరనే చెబుతారు. అటు వేదంలో, యిటు మంత్రశక్తిలో గొప్ప పండితుడుగా పేరు గడించుకున్నారు ఆయన!



బందీ

ఫొటో: వి. సీతారాం, మద్రాసు

రోజూ ఉదయం లేచింది మొదలు విద్యార్థులకు శాస్త్రపాఠాలు చెప్పుతూ, దేవిపూజలు చేసుకుంటూ - వ్యవసాయం ప్రధాన వృత్తిగా వుంటుండేవారు.

ఇలా వుండగా ఒకరోజున ఒక విచిత్ర సంఘటన జరిగింది.

ఉదయాన్నే లేచి తోటపనులు చక్కబెట్టుకుని, రామఘట్టంలో జపం చేసుకుని- తిన్నగా పదకొండు గంటలకు ఇంటికి వచ్చేవారు శాస్త్రులుగారు. ఇంటికి వచ్చి దేవికి పూజచేసి, నైవేద్యం పెట్టుకుంటే కాని భోజనం చేయరు. ఒకనాడు అలాగే దేవిమందిరంలోకి వెళ్ళి దేవిపూజ చేసుకుంటూ కూర్చున్నారు.

ఇంతలో వాడుకగా వచ్చి పిల్లలకు గాజులువేసే గాజులసెట్టి వచ్చాడు. శాస్త్రులుగారి భార్య పిల్లల్ని పిలిచి - నలుగురికీ చేతులకి గాజులు తొడిగించి - "అయ్యగారు పూజలో వున్నారు, అరుగుమీద కూర్చో - వచ్చి డబ్బు యిస్తారు"- అని చెప్పి తను లోనికి వెళ్ళిపోయింది.

శాస్త్రిగారు కొంతసేపటికి జపం ముగించుకుని, అరుగుమీద కాచుకు కూర్చున్న గాజులసెట్టివద్దకు వచ్చి "ఏమయ్యా! గాజులు వేసినందుకు ఎంత సొమ్ము అయింది ఏమిటి?" అని అడిగారు.

అంతట గాజులసెట్టి నోటితో లెక్కకట్టుకుని "బాబూ! చేతికి రెండణాలు చొప్పున - ఒక

# "పసిడి విజ్ఞానం"

మూలం: ప్రేమ్‌చంద్

అనువాదం: అక్కిరాజు వెంకటజనార్దన

కేశవ్ ఇంట్లో ఒక చెట్టుమీద ఒక పిచ్చుక గుడ్లుపెట్టింది. కేశవ్, వాడి చెల్లెలు శ్యామా మగపిచ్చుక, ఆడపిచ్చుక అచ్చటికి వస్తూపోతూ వుండటం అతి శ్రద్ధతో తిలకించేవారు. ఆ పసి హృదయాల్లో ఏవేవో వింత విచిత్ర ప్రశ్నలు ఉద్భవించేవి. గుడ్లు ఎంత పెద్దగా వుంటాయి, ఏ రంగులో వుంటాయి, ఎన్ని వుంటాయి, ఏమి తింటాయి, వాటి లోంచి పిల్లలు ఏవిధంగా పుట్టుకొస్తాయి, పిల్లలకు రెక్కలు ఎలా వస్తాయి, గూడు ఏవిధంగా వుంటుంది?

కాని ఈ ప్రశ్నలకు సమాధాన మిచ్చేవాళ్లెవరు అమ్మ అస్తమానమూ ఏదోఒకపనిలో నిమగ్నురాలై వుంటుంది. నాన్నకు చదువుకోడం, వ్రాసుకోడంనుంచి విరామమే లభించదు. పిల్లలు వాళ్ళలో వాళ్ళే ప్రశ్నలు, సమాధానాలు చెప్పుకుని సంతృప్తి నొందేవారు.

పిచ్చుక గుడ్లను చూట్టానికి వాళ్ళు తహతహలాడి పోతున్నారు. "ఈపాటికి పిల్లలు పుట్టేవుంటాయి" అని వాళ్ళు అనుకున్నారు. పిల్లల ఆహార సమస్య వాళ్ళను కలవర పెట్టింది. 'పిచ్చుక ఇన్ని పిల్లల కడుపు నిండేట్టుగా గింజలు ఎచ్చటి నుంచి తేగలుగుతుంది పాపం!

---

రూపాయి-నాలుగణాలయిందండి" - అన్నాడుట!

అసలే మిట్టమధ్యాహ్నం ఇంకా భోజనమయినా చేయలేదు శాస్త్రిగారు. మంచి నీరసంగా వుండే సమయం!!

గాజులసెట్టి "చేతికి రెండణాల చొప్పున మొత్తం ఒక రూపాయ, నాలుగణాలయిం"-దని అనగానే ఛ్రురున కోపం వచ్చింది

"అరే! నాకు వున్న పిల్లలు నలుగురు. పుట్టినవాళ్ళూ నలుగురే! అటువంటిది - నలుగురకూ - ఎనిమిది చేతులకూ - ఎనిమిది రెళ్ళు పదహారణాలు - అంటే ఒక రూపాయికదా అవాలి" అనుకుని- గాజులసెట్టి తననే మోసంచేయ తలపెట్టినందుకు కోపంగా కేకలువేయ సాగాడు శాస్త్రులుగారు

ఈ కేకలకు బెదరిపోతూ - "అయ్యా! మీకు నలుగురు పిల్లలు కలిగారో, ఐదుగురు కలిగారో దేవునికి తెలియాలి సత్యప్రమాణపూర్తిగా నేను ఐదుగురు అమ్మాయిలకు గాజులు వేశాను - అంతకన్న నన్ను ఏం చెయ్యమంటారు!"-అని వాపోయాడు ఆగాజులసెట్టి!

అయినా నమ్మడం ఎలాగ? తన నలుగురు పిల్లలూ గాజులు వేయించుకుంటే - ఐదుగురు అంటే- ఎలా సహించేది? అని తర్కించుకుంటూ తిన్నగా దేవీమందిరం వద్దకు వెళ్లారు శాస్త్రులుగారు!

"అమ్మా దేవీ! నాకు నలుగురు పిల్లలు అని నీకు తెలియదా? ఇతడు ఈ మిట్టమధ్యాహ్నం అయిదుగురికి గాజులు వేశానని అబద్ధం ఆడి గోలపెడ్తున్నాడేమిటి తల్లీ!" అంటూ అడిగారట

అంతే! ఆ వెంటనే - మందిరంలోని విగ్రహం గాజుల చేతులు గలగలలాడిస్తూ - "నీ కుమార్తెలకు గాజులు వేయించినప్పుడు నాకు వేయించలేదు - నన్ను విడిచిపుచ్చారు! నేనే వచ్చి ఐదవకూతురుగా గాజులు తొడిగించుకుని వెళ్ళాను! అందుకు గాజులసెట్టికి ఐదుగురు పిల్లలకూ లెక్క కట్టి సొమ్ము యివ్వవలసిందే" - అని పలికిందట దేవి! ఆ మాటలకు ఆశ్చర్యచకితులయిపోయారు శాస్త్రిగారు!

మహానందంతో గాజులసెట్టి వద్దకు వచ్చి - "తండ్రీ! నాకు నలుగురు పిల్లలు కాదు, ఐదుగురు పిల్లలే! నువ్వు పుణ్యాత్ముడవు" - అని గాజులసెట్టిని వేడుకొని, ఇతోధికంగా సొమ్మిచ్చి గౌరవించారు శాస్త్రులుగారు! ★

## ★ "పసిడి విశ్వాసం" ★

పిల్లలు ఆకలికి తాళలేక కీచు... కీచు మంటూ చచ్చిపోతాయి.'

ఈ ఘోరవిపత్తును ఊహించుకొని ఇద్దరూ ఆందోళన చెందారు. చెట్టుమీద గింజలు పిల్లదానికి తినిపించుకున్నారు

"అన్నయ్యా పిల్లలకు ఎంత కొట్టమూ" అమాయకంగా అన్నది శ్యామా.

కేశవ్ దృష్టి ఇంకా ఈ విషయంమీదికి పోలేదు. "అప్పుడు తప్పకుండా కొడ్తుంది పాపం పిల్లలు దప్పికి అలమటిస్తుంది వచ్చును. పైన నీడైనా లేదు" అన్నాడు.

తెరలాంటి గుడ్డకట్టి పందిరిలాంటిది వేయడానికి నిశ్చయించుకున్నారు చారెడు బియ్యం, గిన్నెతో నీళ్ళు పెట్టాలన్న ఆలోచన కూడా అంగీకరించబడింది.

ఇద్దరూ చాలా ఆసక్తితో చురుగ్గా పని చేయసాగారు శ్యామా ఎవ్వరికంట పడకుండా కుండలో నుంచి బియ్యం తెచ్చింది. కేశవ్ ఒక పగిలిపోయిన కుండపెంకును శుభ్రంచేసి నీళ్లునింపాడు. మరొక్క-కరికరం మాత్రం మిగిలింది. పందిరి కట్టడానికి గుడ్డ ఎచ్చటినుంచి తేవాలి? తెచ్చినా ఎత్తుకఱ్ఱలు లేందే ఎలా నిలబడుతుంది. అసలు ఎత్తుకఱ్ఱలను చెట్టుమీద ఎలా నిలబెట్టడం. అన్నిసమస్యలే కేశవ్ చాలా సేపటివరకు తీవ్రంగా యోచించాడు. చివరకు ఈ జటిల సమస్యను కూడా పరిష్కరించగలిగాడు.

"నువ్వు పోయి కసువు ఎత్తే తట్టను పట్టుకురా అమ్మ చూడకుండా" కేశవ్ చెల్లెలితో అన్నాడు.

"తట్టకు చిల్లుం దన్నయ్యా, ఎండ వస్తుంది"

"నీకవన్నీ ఎందుకు వెళ్ళి పట్టుకురా, ఉపాయం నే చెప్తాగా."

శ్యామా పరుగెత్తుకుంటూ వెళ్లి తట్ట తెచ్చింది. కేశవ్ దానిచిల్లిలో కాగితాలు కుక్కాడు. తట్టను ఒక ప్రక్కకు పెడ్తూ, "దీన్ని గూటికి అడ్డంగాకడ్తా, ఎండ ఎలా పడ్తుందో చూస్తాగా" అన్నాడు.

"అన్నయ్య ఎంత తెలివైనవాడు" లోలోపలే మురిసిపోయింది శ్యామా.

వేసవికాలపు తీక్షణమైన ఎండరోజులు. తండ్రి ఆఫీసు కెళ్లాడు. తల్లి పిల్లలిద్దర్నీ పడుకోబెట్టి తానూ ఒరిగింది. కాని ఇవాళ వాళ్లకు నిద్రేలా వస్తుంది. తల్లి, భయంకొద్దీ కళ్లు మిగించి పడుకున్నట్లు నటించారు. సమయానికై వేచియున్నారు.

తల్లి నిద్రపోయిందని తెలుసుకోడమే తడవుగా అడుగులో అడుగేసుకుంటూ తలుపు తెరిచి బయట బడ్డారు గుడ్డ సంతరణ కార్యక్రమంలో నిమగ్నులయ్యారు.

కేశవ్ గదిలో కెళ్ళి స్టూలు తెచ్చాడు. దాంతో పని సాగలేదు. స్నానాలుచేసే పీట తెచ్చి స్టూలు కింద ఎత్తువేశారు. భయపడ్తూ అరచేతిలో ప్రాణాలు పెట్టుకొని ఎక్కాడు. శ్యామా రెండు చేతులతో స్టూలును గట్టిగా పట్టుకుంది. నాలుక్కాళ్లు పొందిక కుదరక స్టూలు నృత్యం మొదలెట్టింది. కేశవ్ చాలా భయపడ్డాడు.

"శ్యామా, గట్టిగా పట్టుకో దిగి వచ్చానంటే ఒళ్లు హూనం చేసేస్తా" అంటూ భయపెట్టాడు. శ్యామా దృష్టంతా గూటిమీదే వుంది. దాన్నిగూర్చే ఆలోచిస్తున్నది. అందువల్ల అప్పుడప్పుడు పరధ్యానంతో వదిలేది. కేశవ్ కొమ్మను పట్టుకొని వేళ్లాడాల్సివచ్చేది.

కేశవ్ చేతులు పడగానే పచ్చకలు రెండూ తుర్...ర్ మన్నాయి. కొమ్మమీద పుల్లలు, గడ్డిపోచలు చిందరవందరగా పడివున్నాయి. వాటిమీద మూడు గుడ్లున్నాయి. లోగడ తాను చెట్టుమీద చూచిన మాదిరి పిట్ట గూళ్లేవీ అచ్చట కేశవ్‌కు కన్పించలేదు

"అన్నయ్యా, ఎన్ని పిల్లలున్నాయ్" క్రిందినుంచి శ్యామా అడిగింది.

"మూడు గుడ్లున్నాయి, ఇంకా పిల్లలు కాలేదు"

"నాకు చూపన్నయ్యా, ఎంత పెద్దవో చూస్తా"

"వుండూ, మొదట కొంచెం గుడ్డ పట్టుకోరా, అన్నీ పుల్లలే పాం. గుచ్చుకుంటున్నాయేమో"

శ్యామా పరుగెత్తుతూ వెళ్ళి ధోవతిని చింపి గుడ్డముక్క తెచ్చింది. కేశవ్ నాలుగైదు మడతలు వేసి పరుపు సిద్ధం చేశాడు. పుల్లలమీద పర్చి మూడు గుడ్లనూ పెట్టాడు.

"అన్నయ్యా నాకు చూపించవూ" శ్యామా మళ్ళీ అడిగింది

"వుండూ, తట్ట తెచ్చియ్యి ఎండ వస్తుంది అడ్డంగా కట్టాలిగా"

శ్యామా తట్ట అందిస్తూ, "అన్నయ్యా, ఇప్పుడన్నా దిగి రా నేను చూస్తా" అన్నది.

కేశవ్ తట్టను ఒక కొమ్మకు వేళ్లాడకట్టి "పోయి నీళ్లచిప్ప తీసుకురా, నేను దిగాక చూద్దువుగాని" అన్నాడు.

శ్యామా నీటి చిప్పను, బియ్యాన్ని అందించింది. కేశవ్ రెండు వస్తువులనూ అమర్చి మెల్లగా కిందికి దిగాడు

"ఇక నన్నెక్కించు" గుడ్లను చూడాలన్న ఆత్రంలో అంది శ్యామా.

"వద్దు, నువ్వు క్రింద పడ్తావ్" భయపెట్టాడు కేశవ్

"నేనేం పడన్లే, నువ్వు స్టూలు గట్టిగా పట్టుకో"

"నువ్వు పడిపోతే అమ్మ నా



నృత్యం నేర్చిన ఆంధ్రా సిస్టర్స్.

ఒళ్లు పచ్చడి చేస్తుంది. అయినా ఇప్పుడు నువ్వెక్కి ఏం చేస్తావ్ చెప్పు, గుడ్లు హాయిగా పడుకున్నాయి, పిల్లలు పెట్టాక మనమే పెంచుతాంగా" అంటూ కేశవ్ చెల్లెల్ని బుజ్జగించసాగాడు.

పిచ్చుకలు మాటిమాటికి గూటి వద్దకు వచ్చి కూర్చోబోతుండగానే ఎగిరి పోతున్నాయి 'మనం వుండటంవల్ల అవి భయపడి వాలడం లేదు' అనుకున్నారు. కేశవ్ స్టూలును పట్టుకొని గదిలోకి వెళ్లి పోయాడు.

"నాకు గుడ్లనుచూపలేదుకదూ అమ్మకు చెప్తాలే" ఉప్పొంగివచ్చే దుఃఖంతో అంది శ్యామా

"అమ్మకు చెప్పావా దెబ్బలు తప్పవు మొదలే చెప్పేస్తున్నా" వార్నింగ్ యిచ్చాడు కేశవ్.

ఇంతలో గది తలుపులు తెరుచుకున్నాయి. "ఎండలో ఏం చేస్తున్నార్రా, మధ్యాహ్నం బయటికి రావద్దని చెప్పలా, గోళ్లెం ఎవరు తీశారు" అంటూ నిద్రకళ్లను తుడుచుకుంటూ తల్లి ప్రత్యక్షమైంది.

## ★ పసిడివిజ్ఞానం ★

తలుపుగొళ్లెం కేశవ్ తీశాడు. కాని శ్యామా మాట్లాడలేదు. చెప్తే అన్న చితగ్గొడతాడని బాగా తెలుసు. అదీగాక తానూ ఈ నేరంలో భాగస్వామే కాబట్టి అలా మౌనం వహించివుంటుంది. తల్లి ఇద్దరికీ చెరో లెంపకాయ ఒడ్డించి గదిలో పడుకోబెట్టి తాను ఒక ప్రక్కకు ఒరిగింది. అప్పటికి సమయం రెండు గంటలే అయింది బయట వడగాడ్పులు మహాప్రళయంగా వీస్తున్నాయి. పిల్లలిద్దరికీ కన్ను మలిగింది.

నాలుగు గంటలకు శ్యామాకు మెలకువ వచ్చింది. గొళ్లెం తీసే వుంది. శ్యామా పరుగెత్తుతూ చెట్టు వద్ద కెళ్ళింది. గూటివైపుకు దృష్టిని ప్రసరించింది అక్కట తట్ట జాడ లేదు. నేలవైపుకు దృష్టిని మళ్లించింది ఒకదూకున గదిలోకి వచ్చిపడింది. "అన్నయ్యా గుడ్లు కింద పడ్డాయి, పిల్లలు ఎగిరిపోయినట్లున్నాయి" అని అరిచింది. కేశవ్ చాలా ఆందోళన చెందాడు. పరుగెత్తుకొచ్చి చూశాడు. మూడు గుడ్లూ ముక్కలు చెక్కలై నేల మీద పడివున్నాయి నీళ్ళతో పెట్టిన పెంకు కూడా ఆ చేరువలోనే పగిలి పడివుంది. వాడి వాలకం మారిపోయింది. ఒళ్ళు ముచ్చెమటలు పోసింది.

"అన్నయ్యా, పిల్లలు ఎప్పటికి ఎగిరిపోయాయ్" శ్యామా అంది.

"గుడ్లు పగిలాయిగా" గద్గద స్వరంతో అన్నాడు కేశవ్.

"అవును పిల్ల లెక్కడికి పోయాయ్"

"నీ తల్లోకి, కన్పించడం లే, గుడ్లు పగిలిపోయి చాన కారుతుంటేను. ఇవే నాలుగు రోజులవుతే పిల్లలుగా మారుతాయ్"

"ఎండలో ఏం చేస్తున్నార్రా" తల్లి కేకేసింది.

"అమ్మా పిచ్చుక గుడ్లు పగిలిపోయాయే" అన్నది శ్యామా.

"ముట్టుకున్నారా ఏమిటి భడవలు" తల్లి పగిలిపడివున్న గుడ్లను చూసి కోప్పడింది.

శ్యామాకు ఇప్పుడు అన్నయ్య మీద కొంచెమైనా కనికరం కలుగలేదు. గుడ్లను అంచుకు పెట్టాడేమో అందుకే కిందపడ్డాయి. చేసిన తప్పిదానికి తప్పకుండా శిక్షపడి తీరాల్సిందే అనుకుంది.

"అమ్మా, అన్నయ్య గుడ్లను ముట్టుకున్నాడే" అన్నది.

తల్లి అడిగింది కేశవ్ నోరు కదపలేదు.

"అసలు నువ్వక్కడికి ఎలా ఎక్కావ్" తల్లి గద్దించింది.

"పీటమీద స్టూలు పెట్టుకొని ఎక్కాడే" శ్యామా చెప్పింది.

"స్టూల్ను పట్టుకొని నువ్వు నిల్చున్నావుగా" అన్నాడు కేశవ్

"నువ్వే పట్టుకోమన్నావుగా" శ్యామా అన్నది.

"ఏడ్వలేకపోయావ్, ఇన్నేళ్లొచ్చాయి, మనం తాకితే గుడ్లు చెడిపోతాయి, పిచ్చుకలు వాటిని పొదగవన్న జ్ఞానమున్నా లేదాయె"

"అయితే పిచ్చుకలే గుడ్లను పడేశాయా" భయపడ్తూ అడిగింది శ్యామా తల్లిని.

"మరేం చేస్తాయి?"

"నేనేం చేయలేదే మెత్తగా వుండటానికి గుడ్డతో పరుపు చేసి గుడ్లను పడుకోబెట్టాను అంతే" ఉప్పొంగివచ్చే దుఃఖంతో అన్నాడు కేశవ్

తల్లికి నవ్వొచ్చింది.

కేశవ్ తన తప్పిదానికి చాలా కాలంవరకు విచారించాడు. గుడ్లను సంరక్షిస్తున్నాననే గర్వంతో వాటిని సర్వనాశనం చేశాడు ఈ సంఘటన జ్ఞప్తికొచ్చినప్పుడల్లా విచారపడేవాడు కేశవ్. నాటు మొదలు ఆ పిచ్చుకల జంట మళ్ళీ అచ్చట కానరాలేదు. ★

# విజ్ఞానవీధులు

## "డాక్టర్"

### మనవాళ్ల నమ్మకాలు

నిజమా? అని నరసాపురంనించి పి. వి. జె. కృష్ణారావుగారట అడుగుతున్నారు. నిజమా అబద్ధమా అని అడగడముకంటె, 'మనవారి నమ్మకాలకు ఆధారాలేమిటి' అని తర్కించడము మేలనిపిస్తుంది

కార్తీకపౌర్ణమినాడు తెలుగుతల్లులందరూ ఉపవాసముండి చల్లని చందనాన్ని తమలపాకుమీద చంద్రుడిలాగ గుండ్రంగా దిద్ది పూజచేస్తారు. వారి నమ్మకమేమిటి? చల్లని చంద్రుడు వారి కడుపు చలవను—అంటే సంతానపు భద్రతను—కాపాడతాడనీ. రథసప్తమినాడు సూర్యుని రథాలు ముగ్గులతాయని నానుడి సూర్యుడికి పరమాన్నం నైవేద్యం పెట్టి పూజచేస్తారు ఉదయమే అర్కపూజా దినముకనక అర్క — జిల్లేడు — పత్రము నెత్తిమీద పెట్టుకొని స్నానముచేస్తారు.

గ్రహణకాలములో సూర్య చంద్రులు మొర్రితో కనబడతారు కనక గర్భిణీ స్త్రీలు ఆ బింబాల్ని చూస్తే బిడ్డలూ మొర్రితోనే పుట్టుదురని నమ్ముతారు.

సుమంగళీ, పుస్తకహస్తుడైన విద్యార్థీ, నీళ్ళకావిడీ వంటివి శుభప్రదాలు, కోరదగినవి కనక వీరు ఎదురుగా వస్తే శుభశకునమని నమ్ముతారు.

మృతశరీరాలను గృధ్ర, వాయస, జలచరములు భక్షిస్తాయి కనక మరణించినవారి ప్రేతము లా మూడింటిద్వారానూ భక్షిస్తాయని నమ్ముతారు.

దీపము చీకటిని పారద్రోలినట్లే చీకటివలె భయంకరములైన దయ్యాలను కూడా పారద్రోలుతుందని నమ్ముతారు

సంవత్సరపు తొలిదినము ఎలాగడుపుతే అలాగే తక్కినదినాలూ గడుస్తాయంటారు.



పంచభూతాత్మకమైన ప్రపంచానికి ఎండ, వాన, శీతు, ఆవేశించినట్లే మన శరీరాలకికూడా పిత్త, కఫ, వాతములు ఆవేశిస్తాయి అని నమ్ముతారు

లంచముతిన్న మానవునివలెనే మొక్కుబడులుతిన్న (!) దేవుడుకూడా మేలుచేస్తాడని నమ్ముతారు

జనులలో తారతమ్యాలున్నట్లే దేవతలలో తారతమ్యాలున్నాయనీ, మనలాగే దేవతలుకూడా భార్యాబిడ్డలతో జీవితము గడుపుతున్నారనీ నమ్ముతారు.

మనవారి నమ్మకాలు ఎన్నో పోలికనిబట్టి మాత్రమే పుట్టినవని చెప్పడానికి ఈ ఉదాహరణలు చాలనుకుంటాను

పోలికలనుబట్టి రెండుపదార్థాలు ఒకటే అనడానికి వీలులేదు పోలికలున్న వస్తువుల గుణాలు వేరుగా కూడా ఉండవచ్చు. ముత్యపుచిప్పలో వెండి ఉండదు. బంగారంలో గంధకం ఉండదు.

అయినప్పటికీ ఈ 'పోలిక' అనేదే మనవారి నమ్మకాల్ని నేటికీనడుపుతోంది. ఈ పోలికతో మనపూర్వులు శాస్త్రాలలో ఇమిడ్చేశారు. స్వరాలు ఏడు, కులపర్వతాలు ఏడు, వారాలు ఏడు. మరి వీటికి సంబంధము లేకపోవడమేమి? అని సంబంధము కలిపేశారు వీటివెనకనే వేదాలూ, రుచులూ, రంగులూ అన్నీ దూరిపోయాయి ఈ విపరీత బాంధవ్యములోనికి.

కార్యకారణాలకి సంబంధముండనక్కరలేదు మనవారి నమ్మకాలకి మోడైనచెట్లమీద ఉంటుంది కనక తీతువుపిట్ట ఎక్కడుంటే అది మోడైపోతుందిట. స్మశానాల్లో ఉంటుంది గద్ద. అది ఇంటిమీద వాలితే ఆయింట్లో ఎవరికో కాలము మూడుతుందట. కాకి ప్రేతస్థానముకదా మరి కాకి వాలితే తప్పాలేదేమో? మనము బయలుదేరిన వేళకి మనకార్యసిద్ధికి సంబంధమేమిటో? గ్రహాల స్థానాలకి మన జీవితాలకి సంబంధమేమిటో? రాసులన్నీ తిరుగుతూనే వుంటాయిగదా, వాటికి ఫలమేమిటో? తిరిగేరాశిలో ఉన్న గ్రహానికి ఫలమేమిటో?

ఈ నమ్మకాలకి ఒకతాడూ బొంగరమూ లేవు. నోరు ఉన్నవాడిదే రాజ్యము, ఎప్పుడుకీ వాటిరోజుల్లో. కేమానా! ★

## ఇదీ - వ్యాపారము!

(34-వ పేజీ తరువాయి)

చాలా రోజులవరకు చంద్రారావు విషయం తెలీలేదు.

ఒకనాడెవరో మా వూరి షాహుకారు కలిస్తే అతని క్షేమం కనుక్కున్నాను.

ఇప్పుడు అతను భార్యను వదిలేశాడుట. ఆవిడ పుట్టింట్లోనే వుంటోందిట! వాళ్లకు ఏవో దావాలు అవీ నడుస్తున్నాయిట! నాకదంతా అగమ్యగోచర మనిపించింది.

చంద్రారావుఅంటే కిట్టనివాళ్లు ఎందరో వున్నారు అవన్నీ వాళ్లు కల్పించిన విషయాలేమో ననుకున్నాను

ఎంత రెట్టించి అడిగినా ఆ షాహుకారు అసలు కారణం నాకు చెప్పలేకపోయాడు.

నా ఆత్రుత ఎక్కువైంది. మా వూరు వెళ్లే రోజుకోసం నిరీక్షించసాగాను.

### 6

మావూరు వెళ్ళిన రెండుగంటల్లోపలే చంద్రారావుని కలిశాను.

అతను యథాప్రకారముగానే కనుపడ్డాడు.

విషయమంతా అడిగాను

"నీకు ఆశ్చర్యం కలిగించిందా?"

"కాక?"

"ఐతే అసలు విషయం విను. నీ కేమీ వింత అనిపించదు

"అసలు నేనప్పుడు పెళ్లిచేసుకోడానికి ఎందుకు అంగీకరించాననుకున్నావు? పార్లమెంటులో ఒక బిల్లు పాసైంది, దాన్ని ఆధారంగా నా వ్యాపారాన్ని వృద్ధిచేసుకోదల్చుకున్నాను

"వాళ్ల ఆస్తిని నేనెప్పుడూ ఆశించలేదు వాళ్లు ఐచ్ఛికంగా ఇచ్చే కట్నం తీసుకున్నాను. అందులో నేనేమీ చేత సారాలు చెయ్యనిది నువ్వు గమనించే వుంటావు.

"ఇంక రెండో విషయం ధనవంతులైన భార్యల్నుండి, భర్తలు విడాకులు తీసుకుంటే, భార్యలే భర్తలకు మనువర్తి ఇవ్వాల్సి వస్తుంది - ఆ బిల్లు ప్రకారం. ఆ బిల్లు ననుసరించి దావావేసి దాన్ని కూడా పొందాను" అన్నాడు విజయగర్వంతో మెరుస్తున్న కళ్ళతో చూస్తూ.

నేను ఆశ్చర్యంలో మునిగాను! 'ఇదీ వ్యాపారమే!' అనుకుంటూ. 



వి. ఆర్. కర్దార్ 'యాస్మిన్'లో నర్తకి వైజయంతీమాల.

కశ్యంకింద ఆరింటియా పిక్చర్స్ నిర్మించిన చిత్రం "సితారా"లో కూడా వైజయంతీ మాల నృత్యం బాగానే వుంది.

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

# సినిమా వార్తలు

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

లలితా ఫిల్మ్స్ లిమిటెడ్ అనే కొత్త సంస్థ ఒకటి "చరణదాసి" అనే చిత్రాన్ని తెలుగులో నిర్మిస్తున్నది. చిత్ర నిర్మాణానికి వాహినీ స్టూడియోలో జూన్ 10 వ తేదీని శ్రీ బి. నాగిరెడ్డి ప్రారంభోత్సవం జరిపారు. శ్రీ యస్. వి. రంగారావుగారు క్లాప్ చేశారు. ఈ చిత్రంలో భూపతి నాయుడు అనే కొత్త యువకుని నిర్మాతలు ప్రవేశ పెడుతున్నారు.

"చరణదాసి" నిర్మాత శ్రీ శంకరరెడ్డి. కథకులు శ్రీ సదాశివబ్రహ్మం. దర్శకులు శ్రీ తాతినేని ప్రకాశరావు. వాహినీ స్టూడియోలో 15 వ తేదీని షూటింగ్ ప్రారంభమైనదట. డిస్ట్రిబ్యూటర్లు బసంత్ పిక్చర్స్ లిమిటెడ్, విజయవాడ.

*　*　*　*

## శ్రీమతి భానుమతి కుమారుని ఉపనయనం

భరణీ స్టూడియో యజమానులు శ్రీ పి. ఎస్. రామకృష్ణ, శ్రీమతి భానుమతిగార్లు ఈ నెల 9 వ తేదీన ఉదయం తమ కుమారుడు చి॥ భరణి ఉపనయనం త్యాగరాయ నగర్ లోని స్వగృహంలో వైభవంగా జరిపించారు. మద్రాసు సినిమా రంగంలోని ప్రముఖులు, పురప్రముఖులు ఉత్సవానికి హాజరయ్యారు. ఆనాటి సాయంత్రం భరణీ స్టూడియోలో విందు, శాయి, సుబ్బులక్ష్మిల నృత్య ప్రదర్శనం జరిగాయి.

*　*　*　*

## శ్రీమతి జానకి నూతన గృహప్రవేశం

సినీతార శ్రీమతి జానకి, శ్రీ శ్రీనివాసరావులు త్యాగరాయనగరు, గిరిగాడ్ ఎక్స్టెన్షనులో తాము నిర్మించుకున్న నూతన భవనంలో ఈ నెల 11 వ తేదీన ప్రవేశించారు. ఉదయం జరిగిన శాస్త్రోక్త కార్యక్రమానికిన్నీ, సాయంకాలం జరిగిన తేనీటి విందునకున్నూ సినీ పరిశ్రమకు సంబంధించిన పిన్నా పెద్దలు, ఇతర ప్రముఖులు, పత్రికా రచయితలూ పలువురు విచ్చేసి జానకీ శ్రీనివాసులను ఆశీర్వదించారు. శ్రీ "పర్వతనేని" రచించిన "పదిదింపులు" పద్యాలు చదివివినిపించబడ్డాయి.

*　*　*　*

బాలబాలికల కోసం రాజ్ కపూర్ తీస్తున్న "అబ్ దిల్లీ దూర్ నహీఁ" అనే హిందీ చిత్రంలో మాస్టర్ రోమి, బేబీ చాంద్ నటిస్తారు. అఖ్తర్ మిర్జా కథ వ్రాస్తున్నారు. దీనికి దర్శకుడు అజిత్ కుమార్.

*　*　*　*

హానోవర్ లో జరగబోతున్న పారిశ్రామికోత్సవానికి గాను జర్మన్ నిర్మాతలు కొందరు తీయబోతున్న డాక్యుమెంటరీలో భాక్రానంగల్ ప్రాజెక్టు దృశ్యాలను చూపిస్తారు. ఈ దృశ్యాలను షూట్ చెయ్యడానికి జర్మన్ కెమెరామన్ గంథర్ హాండర్ట్ మార్క్ భారతదేశం వచ్చాడు. భాక్రానంగల్ వంటి ప్రాజెక్టుల సహాయంతో ఎంత పారిశ్రామికాభివృద్ధిని సాధించవచ్చునో చూపించడం అతడి లక్ష్యం.

*　*　*　*

అతి స్వల్పకాలంలో బెంగాలీ సినిమాలో అగ్రస్థానం అందుకున్న తార సుచిత్రా సేన్ బిమల్ రాయ్ చిత్రం "దేవదాస్" లో నటించడానికి గాను బొంబాయి వచ్చినది. ఆమె రాకతో బొంబాయి సినిమా రంగంలో చలనం బయలుదేరింది. బారువా చిత్రం "దేవదాస్" తో భారతదేశమంతటినీ ఆకర్షించిన బెంగాలీ తార జమునలాగే ఈమెకూడా బొంబాయి తారలందరినీ మించకలదని కొందరు భావిస్తున్నారు. సుచిత్రా సేన్ సహజ సౌందర్యవతి కావడమే కాక ఆమెకు సహజ నటనా కౌశలం, అద్భుతమైన ప్రతిభ ఉన్నాయిట. ఆమె త్వరలోనే తన భర్తతోపాటుతో కలకత్తాలో స్వయంగా చిత్ర నిర్మాణంకూడా ప్రారంభించడానికి కృషి చేస్తున్నది.

ఇంతవరకూ ఆమె నటించిన 15 బెంగాలీ చిత్రాలలో విజయం సాధించని చిత్రం ఒక్కటి లేదట. కలకత్తాలో ఆమెను బెంగాలీ సినిమా రంగానికి రాణిగా పరిగణిస్తున్నారు.

*　*　*　*

1954 లో భారతదేశంలో మొత్తం 279 భారతీయ చిత్రాలు, 385 విదేశీ చిత్రాలూ సెన్సార్ సర్టిఫికెట్ పొంది ప్రదర్శింపబడినాయని బొంబాయిలో ఫిల్మ్ సెన్సార్ సెంట్రల్ బోర్డు ప్రకటించింది. 1954 లో భారతీయ చిత్రాలలో సర్టిఫికెట్ నిరాకరింపబడిన చిత్రం ఒక్కటికూడా లేదట. విదేశీయ చిత్రాలలో మాత్రం మొత్తం 38 చిత్రాలకు సర్టిఫికెట్ ఇవ్వబడలేదు. (1951లో 5, 1952లో 18, 1953లో 21, విదేశీ చిత్రాలకు సర్టిఫికెట్లు నిరాకరించబడినాయి.)

1954 లో సర్టిఫికెట్ నిరాకరించబడిన 38 విదేశీ చిత్రాలలోనూ 31 అమెరికా నుంచి వచ్చినవి, రెండు బ్రిటన్ నుంచి, రెండు రష్యానుంచి, రెండు చీనానుంచి, ఒకటి ఫ్రాన్స్‌నుంచి వచ్చినవి.

మొత్తం 279 భారతీయ చిత్రాలలోనూ భాషలవారీగా - 120 హిందీ, 48 బెంగాలీ, 40 తమిళం, 27 తెలుగు, 18 మరాఠీ, 10 కన్నడం, 8 మళయాళం, 3 ఇంగ్లీషు,

పంజాబి, 1 అస్సామీ, 1 ఒరియా చిత్రాలున్నాయి.

* * * *

చెన్నపట్నంనుంచి తెనుగు తమిళ తారలు బొంబాయి హిందీ సినిమా రంగం ప్రవేశించాలని చేసిన యత్నాలు అంతగా ఫలించినట్టు కనబడదుగాని, ఇటీవల బొంబాయి హిందీ తారలు మాత్రం చెన్నపట్నం తరలి వస్తున్నారు. గత వారం చెన్నపట్నం స్టూడియోలలో నర్గీస్, రాజకపూర్, బీనారాయ్, దిలీప్ కపూర్, దేవానంద్, కల్పనాకార్తిక్, విజయలక్ష్మి, కుమార్, అన్వర్ హుసేన్, డేవిడ్, భగవాన్, నిమ్మీ మొదలైన వారి రాకపోకలతో మన సినిమా రంగంలో అందరూ హడావిడిగా కనబడుతున్నారు. ★

# ప్రేక్షకుల అభిప్రాయాలు
# "వదినెగారి గాజులు"

"వదినగారిగాజులు" చిత్రం చూశాను. చిత్రం మొదటినుంచి చివరిదాకా బాగానే సాగిందని చెప్పాలి. వాసుగా నటించిన గర్మ నటన ప్రశంసనీయంగా వున్నప్పటికీ అతనిచేత పెద్దపెద్ద వాక్యములు చెప్పించటం సమంజసంగా లేదు. చిన్న క్లాసు చదువుకొనేవాసు తల్లి ప్రేమనుగురించి చెప్పే మాటలు పెద్దఫక్కీలో నడిచినయ్. ఈ సమయములో కవి, దర్శకులు ప్రక్కన నిలబడి పాఠం ఒప్పజెప్పించినట్లుగా వుంది గాని సహజంగా ఏమాత్రమూ లేదు. ఇటువంటిలోపాలే అక్కడక్కడా కన్పిస్తున్నయ్. 'వదిన' చనిపోయినపుడు ఆమె తల్లిదండ్రులు చూడటానికి వచ్చినట్లు కనబడరు. కూతురు మరణావస్థలో వుంటే తలిదండ్రులు రాకుండా ఏ విధంగా వున్నారో తెలియదు. ఎన్ని లోపాలున్నప్పటికి కొన్ని దృశ్యాలు మరపురాకుండా



'నఖబ్' చిత్రంలో మధుబాల, అజిత్.



నౌషద్ నిర్మించిన "ఉరన్ ఖటోలా"లో నిమ్మీ.



లలితా ఫిల్మ్స్ ప్రారంభోత్సవంలో పాల్గొన్నవారు: జానకి, శంకరరెడ్డి (ప్రొడ్యూసర్), సదాశివబ్రహ్మం (కథకులు), ప్రసాద్, నాగిరెడ్డి, రంగారావు, బాపినీడు, చక్రపాణి, రేలంగి, సుబ్బారావు, వెంకట్రావు, రామినీడు, బలరామయ్య, రాయ్, ప్రకాశరావు (డైరెక్టర్), శర్మ (ఆర్ట్ డైరెక్టర్), కృష్ణారావు, వీరరాజు గార్లు. లలితా ఫిల్మ్స్‌వారు 'చరణదాసి' నిర్మించబోతున్నారు.



లలితా ఫిల్మ్స్‌వారు 'చరణ దాసి'లో ప్రవేశపెడుతున్న బాపినీడు.

# ప్రేక్షకుల అభిప్రాయాలు

మనలో నాటుకొనిపోయేవి వున్నవి. అటువంటివాటిలోకి వచ్చేదే వాసు మొదట తన వదినని చూడటానికి వచ్చే దృశ్యం; తరువాత వదిన మరదులు మాటలు లేకుండా ఒకరికొకరు సహాయం చేసుకోవటం. పాటలంత ప్రశంసనీయంగా లేకపోయినప్పటికీ మొదట వాసు పాడిన "వరుడికి తగిన వధు వండీ మరది కోరిన వదినండీ" అన్న పాట బాగుంది.

నటీనటుల్లో 'వదిన'గా నటించిన శ్రీమతి అంజలీదేవిని ప్రశంసించక తప్పదు. ఆమె వేషము, వేషమునకు తగిన భాష, భాషకి తగిన ఆమె నటన పాత్రకి వన్నె పెట్టి గృహలక్ష్మికి తగిపోయింది. ఒకేసారి కనబడినా ప్రేక్షకులను కడుపుబ్బ నవ్వించాడు మాస్టరు నాగేశ్వరరావు.

అసలీ చిత్రంలో శ్రీమతి ఇందిరాచార్య అనవసరం. ఎన్ని లోపాలున్నప్పటికి చిత్రం మొత్తంమీద విసుగనిపించలేదు.

దాసరి శారద—గుంటూరు.

*　　*　　*

ఇది రసాత్మకమైన ఉత్తమ చిత్రం. వివిధ మనస్తత్వములు గల వ్యక్తులను చక్కగ చిత్రించినారు. పటుత్వము గల కథావస్తువగుటవలన ప్రతిపాత్ర సజీవం గాకనిపిస్తుంది. రజనీకాంత్ గారు ప్రతిసన్నివేశము ఉత్తేజకరంగా చిత్రీకరించగలిగినారు. అన్నిరకముల ప్రేక్షకులను ఉఱ్ఱూతలూగించిన కొన్ని సంఘటనలు షేక్స్పియర్ యొక్క ప్రత్యేకకృషికి నిదర్శనములు.

ఈ చిత్రమందున్న "హైలైట్సు" సామాన్య ప్రేక్షకునికి సహితము ఆలోచనలు రేకెత్తిస్తాయి. పినిశెట్టిగారి మాటలు చమత్కారంతో రసవంతముగ వున్నవి. పాటలు కొన్ని బాగున్నా, మరికొన్ని పాతచిత్రములను జ్ఞాపకంచేస్తూ రాణించలేదు. నటీనటులందరు పాత్రోచితముగ కడు సమర్థతతో నటించినారు. మాస్టర్ వర్మ, అంజలీదేవి, అమర్‌నాథ్‌ల నటన ప్రత్యేక ప్రశంసార్హముగ నున్నది. మాతృదేవి స్వరూపమే తెలియని అభాగ్యునిగ నటించిన వర్మ తన భావాలను స్వాభావికముగ ఆకర్షణీయముగ ప్రకటించగలిగినాడు. ఇతనినటనకు ముగ్ధుడుగాని ప్రేక్షకుడురుడు.

యల్. వి. కృష్ణారెడ్డి,
—నెల్లూర్.

*　　*　　*

కథలో మంచి నీతి, పటుత్వము వున్నవి. పాటలు శ్రవణానందకరంగా లేవు. చిన్నతనంలో వాసుగా నటించిన బాలనటుడు ప్రతి ప్రేక్షకుని హృదయం ఆకర్షించాడు. అమరనాథ్, చలం అంజలీదేవి అత్యుత్తమంగా నటించారు. హాస్యం శ్రుతిమించకుండా పరిహద్దులలో నేవుంచి చిత్రం రసవత్తరంగా తయారుచేశారు.

గో. సు. రా. పంత్,
—గుంటూరు.

*　　*　　*

గోకుల్ పిక్చర్సు వారి 'వదినగారి గాజులు' చిత్రం మరాఠీ చిత్రానికి అనుకరణమే యైనా చక్కని చిత్రమే అని చెప్పాలి.

"షాక్ షార్ భక్త్" చిత్రంలో
శుభ ఖోటు, వివేక్, ఇందిరా.



నౌషద్ నిర్మించిన "ఉరన్
ఖటోలా"లో నిమ్మీ.

Printed and Published for
Nageswara Rao Estates Ltd., by
S. Radha Krishna at The
Andhra Patrika Press,
5&7, Thambu Chetty St., Madras-1.
Editor: S. Sambhu Prasad.



కంచి, కైలాసనాథ దేవాలయ శిల్పం

ఫొటో : ఎస్. వెంకటకృష్ణన్— మద్రాసు.